ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య ౨౦.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

ప్రథమభాగము



అహోబలపండితప్రణీతము.

పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము.

---

కాకినాడ:
కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ
బ్రకటింపఁబడియెను.
౧౯౨౯.

# సవరణపట్టిక.



| పుట. | బంతి | మూలము. | సవరణ. |
|---|---|---|---|
| ౧౬ | ౧౨ | సఖలదర్శ నా | సఖలశాస్త్రదర్శనా |
| ౧౭ | ౬ | గాంభీర్యాప్తిః | గాంభీర్యాప్తి |
| ౨౧ | ౨౫ | తఫఃఫలాయ | తపఃఫలాయ |
| ౨౫ | ౨౫ | కథాప్రారంభము— | ......... |
| ౩౦ | ౧౩ | నోజన్నించె | నాజన్నించె (అనవచ్చును) |
| ౩౨ | ౧ | కల్వాలు నీళ్లలో సుళ్ళ | కలువలు నీళ్లలో సుళుల |
| ౪౦ | ౨౭ | యదుచూళి | యదుమాళి |
| ౪౩ | సూక్ష్మాక్షరములు | లిట్లుకనఁబడు | లిట్టివికనఁబడు |
| ౫౧ | ౬ | బ్రకుకుత్రోవ | బ్రదుకుఁద్రోవ |
| ౫౫ | ౯ | బకరణంబు | బుకరణంబు |
| ౭౦ | ౧౩-౧౪ | చైదమ్ము | చెయ్దమ్ము |
| ౭౫ | ౧౭ | గానుగాడి | గానుఁగాడి |
| ౮౧ | ౧౦ | జ్జాలి | ఝ్జాలి |
| | ౨౨ | మొటంద్రు | యటంద్రు |
| ౮౪ | ౧౭ | దీప్ర | దీవ్ర |
| ౮౭ | ౪ | నేఁగి | వేఁగి |
| ౯౧ | ౮ | బైనయట్లు | బైసనట్లు |
| ౯౬ | ౧౧ | వేగుఁ | వేఁగుఁ |
| ౯౯ | ౨౧ | క్కలహాసి | క్కలహాశి |
| ౧౦౦ | ౪ | మేగె | మేఁగె |
| ౧౦౧ | ౧ | ఛాయ | చాయ |
| | ౬ | నవేత్ర | నవేత్త్ర |

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## పీఠిక.

ఈ గ్రంథము రచించిన విద్వత్కవీంద్రుఁడు ప్రభంజనకులతిలకుఁ డగు నహోబలపతి. ఈ గ్రంథము నాశ్వాసాంతగద్యముల "ఇది... ప్రభంజనవంశాబ్ధి రాకాశశాంక...అహోబలపత్యాహ్వయప్రణీతంబు" అని యున్నది. మఱియు నీకవి రచించిన అహోబలపండితీయ మను కవిశిరోభూషణగ్రంథమున గద్యమందు "ప్రభంజనవంశముక్తామణినా.....అహోబలపత్యాచార్యేణ" అని యున్నది. దీనింబట్టి యింటిపేరు ప్రభంజనమువా రనియుఁ గవిపేరు అహోబలపతి యనియుఁ దేలుచున్నది. కాని, మహారాజశ్రీ జయంతి రామయ్యాపంతులుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక ౧౮ వ సంపుటము ౨ వసంచికలోఁ బ్రకటించిన అహోబలపండితీయపీఠికాశ్లోకములు ౭౮ లో "వాతూలవంశవతార భూయః" అనియు, ౭౯ లో "వాతూలవంశాగ్రణీః" అనియు నుండుటచే నీకవి యింటిపేరు "గాలివా" రని స్పష్టపడుచున్నది. ఈ విషయమై శ్రీ రామయ్య పంతులుగారు కూడ "ఇంటిపేరు గాలివారు" అనియు "కవికి మొదటిపేరు నరసరాజు" అనియు వ్రాసిరి. గ్రంథములందు, అహోబలపతి యనియే యున్నది గాని నృసింహనరసింహాదిపర్యాయపదములు కానరావు. నృసింహస్వామి యహోబలక్షేత్రాధిపతి కావున వా రట్లూహించుట సమంజసము. ఇంతియకాక ఈకవికుటుంబమువారు గుంటూరుమండలమున వినుకొండతాలూకాలోని ముప్పడివరగ్రామమం దున్నా రని కూడ వ్రాసియున్నారు. కావున వ్యవహారమం దట్లు గాలి నరసరా జని యుండవచ్చును. ఈపుస్తకము నకుఁ గవివంశస్థులలో నొకరు ప్రతి వ్రాసినారు. చివర "స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౮౨౨ అగు నేటి శార్వరినామసంవత్సర ఆషాఢ బ ౨ భృగువారం వఱకు ప్రభంజనం వెంకటసుబ్బయ్యశాస్త్రిగారి కుమారుఁడు లక్ష్మీనారాయణ వ్రాసుకున్న కాళిందీకన్యాపరిణయము" అని వ్రాసినారు. వినుకొండతాలూకా కొమ్మాలపాడుపోస్టు పిట్టబండ గ్రామమునుండి కాళిందీకన్యాపరిణయమును గూర్చి గాలి లక్ష్మీనారాయణగారు పరిషత్తున కుత్తరములు వ్రాసిరి.

కవిబంధువులు, గురువు:—

ఇంక నీకవిద్వత్కవి తలిదండ్రులను గుఱించి కాని గోత్రమును గుఱించి కాని తెలిసికొనుటకు రెండు గ్రంథములందును నాధారములు లేవు, కాని, మనకవి పోలూరి మాధవయజ్వకు మేనల్లుఁడును శిష్యుఁడు నై యున్న ట్లీక్రిందిశ్లోకములవలనఁ దెలియుచున్నది.

మన్మాతుర్భ్రాతరంతం సకలగుణనిధిం మాధవం భావయామః-పీఠి శ్లో. ౧౧
ప్రణౌమి సతతం మమ మాతులం తమ్ —శ్లో. ౧౨
ధ్యాయామి మన్మాతులమ్.
పైమాధవయజ్వయే గురువై నట్లు-
మద్గురు మాధవు నభినుతింతు, కాళిం. ౧-౩౦
మద్గురుం దలఁతు మాన్యుని మాధవయజ్వచంద్రముఁ-కాళిం. ౧-౩౧
మోహాంబార హృదంబుజాంతరములో ముమ్మాటికిం గొల్చెదన్
... ... సకలశాస్త్రజ్ఞు గురు న్మాధవున్-కాళిం ౧ ౩౩
తం పోలూరివంశపయోధిచంద్రం వందామహే మాధవవిద్వదింద్రమ్ ౪౨
వందేహం త మనింద్యసద్గుణగణాధారం గురుం మాధవమ్- ౪౫
శ్రీమత్పోలూరిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫురత్సారః- ౭౯
అనువానివలనఁ దెలియుచున్నది

ఈకవికి మేనమామయు గురుఁడు నగు మాధవయజ్వ సకలశాస్త్రపాండిత్యము కలవాఁడును, అష్టభాషాపాండిత్యము కలవాఁడు నని యీక్రింది (కా. ౧-౩౦) వాక్యములవలనఁ దెలియనగును.

గీ. ఏమహాత్ముని దర్శింప నెసఁగు నక్షపాదకణచరజైమినివ్యాసమౌని
కపిలఫణిరాజదర్శనఘటితమోద, మతని మద్గురు మాధవు నభినుతింతు.

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జిర్కుబడ లాడి
గురుభట్టవాగ్గుంభగురుతరవనములో నింబుమీఱఁగ విహారంబు చేసి
యతులసాహిత్యవిద్యాచారుదీర్ఘిక లాలితప్రీతిచే నోలలాడి
కపిలసాత్త్వతేయఘనతంత్రవాక్సుధాధారలఁ గోరిక లూరఁ గ్రోలి
చెలఁగుయష్టభాషయలఁతమాని, యతనుశ్రీరామచంద్రపాదాంబుజాళి
సుజనతల్లజసన్నుతసుగుణపాళి, నభినుతించెద మాధవయజ్వమౌళి ౧-౩౨

ఈభావమే పీఠికాశ్లోకములు ౪౦-౪౫ లలోనున్నది. మఱియు నీమా

ధవయజ్వ గొప్పపండితుఁడును దనపుత్త్రుఁడు నైనదక్షిణామూర్తికంటెఁ దనయం దెక్కువదయ కలవాఁడని పీఠిక ౧౫ శ్లోకములో నీకవి చెప్పకొనినాఁడు.

ఈకవిరచించినగ్రంథములు:—కాళిందీకన్యాపరిణయము, అహోబల పండితీయమను పేరుగల కవిశిరోభూషణము నీరెండే కనఁబడుచున్నవి. ఇతర గ్రంథములు ముందేవైన బైలువడునేమో. పైగ్రంథములలోఁ గాళిందీకన్యా పరిణయమునఁ ౧-౭లో బ్రహ్మస్తవమును, కవిశిరోభూషణములో సరస్వతీ(నకులీ) స్తవమును "సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయం" అను శ్లోకము నను సరించి యొకభావముతో నున్నవి.

కవిపాండిత్యము:—ఈకవి తనపాండిత్యమునుగూర్చి కవిశిరోభూషణము లో నిట్లు చెప్పకొనియెను.

శ్లో. యస్మార్త్యా కవితాకందమూలవాగనుశాసనః
జాగృతోఽహోబలపతీ రాజతే స విచక్షణః. ౭౮

శ్రీమత్పోలురిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫురత్సారః శాస్త్రవిత్ - అని.

మఱియుఁ గవిశిరోభూషణగ్రంథాంతమున "పోలూరి మాధవయజ్వస ముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణేన......అభినవనన్నయభట్టాచా ర్యేణాహోబలపత్యాచార్యేణ" అనియుఁ గాళిందీకన్యాపరిణయాశ్వాసాంత గద్యముల "పోలూరిమాధవయజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యా భరణ......అభినవనన్నయభట్టారకాహోబలపత్యాహ్వయ కవిమహోపాధ్యా యభట్టారక" అనియుఁ గలదు. దీనిచే నీకవి కభినవనన్నయభట్టనియుఁ, గవి మహోపాధ్యాయభట్టారకుఁ డనియు బిరుదు లున్నట్లును, అనేకశాస్త్రము లందుఁ బాండిత్య మున్నట్లును, అష్టభాషాపాండిత్య మున్నట్లును స్పష్టపడుచు న్నది. అభినవనన్నయభట్టబిరుద మీరెండుగ్రంథములలో నుండుటచే గ్రంథ రచనకుఁ బూర్వమే యీబిరుద మీతనికి వచ్చినట్లును, ఆబిరుదమే తనరెండు గ్రంథములందును వ్రాసికొనినట్లును, దోఁచును, లేదా, కవిశిరోభూషణగ్రంథా రంభమునం దైన వచ్చియుండును.

కవికాలము:—ఈకవికాల మెచ్చటను స్పష్టముగాఁ జెప్పఁబడియుండ లేదు. కాని, కవిశిరోభూషణమునందు "గ్రంథో ప్యప్పకవే ర్మదం దిశతు నో విద్వత్కవీనాం ఘనాం"—శ్లో. ౭౨ ''కాకునూ ర్యప్పకవినా గృహీతం— శ్లోకము ౭౧ అని పీఠికయందును గ్రంథమం దక్కడక్కడను, అప్పకవి నుదా

హరించుటం జేసి మనకవి యప్పకవికిం దరువాతివాం డగును. 1578 శకసంవత్సరమున అప్పకవీయము ప్రారంభింపంబడిన ట్లుండుటచేత నతండు క్రీ. శ. 1657 సం॥ కుం దర్వాతివాం డనక తీఱను.

కవిత్వము:—ఈవిద్వత్కవి కవిత్వము మంచి ధారతోను సర్వతోముఖ పాండిత్యముతోను జనువరుల కానందముం గల్గించుచున్నది.

కృతిపతి:—ఈకవి తనగ్రంథములను మనుష్యులకుం గృతి యీయక శ్రీరామచంద్రునకుం గృతియిచ్చెను. దీనివలన నీకవి శ్రీరామునందు మిగులభక్తిగలవాం డని స్పష్ట మగుచున్నది.

కవిత్వములోనివిశేషములు:—ఈతనికవిత్వములోని విశేషము లీతని కత్యధిక మగుసంస్కృతాంధ్రభాషా పాండిత్యము కల దని చాటుచున్నవి. ఇంతే కాదు. సంస్కృతాంధ్ర వ్యాకరణములందుం గూడ, గొప్ప ప్రజ్ఞ కల దనియు, వేదమునందుం దర్కమీమాంసాదిశాస్త్రములందు విశేషపాండిత్య మున్న దనియుం గూడం జెప్పుచున్నవి. మఱియు నిందలిప్రథమాశ్వాసములోని ౧౮౫ వ గద్యములో శ్రీకృష్ణరూపవర్ణన మీతని కలంకారశాస్త్రంబున నసమానపాండిత్యము కల దని నుడువుచున్నది.

ఇతరానుకరణములు:—కవి సంస్కృతాంధ్రభాషలయందుం బాండిత్యము కలవాం డగుటచే నక్కడక్కడ సంస్కృతశ్లోకభావములను నితరాంధ్రమహాకవుల భావములను గొంచెము మార్పులతోం దనగ్రంథమందుం జొన్పినాండు, చూడుండు.

శ్లో. కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్
బాంధవాః కుల మిచ్ఛన్తి పక్వాన్న మితరేజనాః- అనుదానికి-

ఉ. తల్లి ధనాఢ్యు సశ్రుతిని దండ్రియు బంధులు సత్కులీనుంగా
నెల్లరు నోదనప్రదుని నెన్నంగం గన్నియ రూపవంతుంగా
నెల్లెడం గోరు కన్నియను నేడ్తెఱం గల్గినకృష్ణుం గూర్పలేరు... ౨౮౦

శ్లో. పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
పుత్రో రక్షతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి-అనుదానికి

గీ. బాల్యమున మాతృపితరులుం బ్రాయమునను
మగండు ముదిమిని దనయుండు మగువ కరయ
నధిపు లగుదురు తదధీన లగుటం గాన
మానవతులకుం దమయిచ్చ మలయం జనదు. ౨-౫౬

"కస్తూరీతిలకం లలాటఫలకే" అను సుప్రసిద్ధశ్లోకమునకుఁ జక్కని తెనుఁగు.

సీ. మృదులఫాలమునందు మృగమదంబు ధరించి రొమ్మునఁ గౌస్తుభరత్నమ్ముఁ బూని
నాసికాగ్రమునందు నవ్యమౌక్తిక మూని కరముల రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి రాణించు పీతాంబరంబు గట్టి
కొంతతడవు సుస్థిరపదు కోమలాంగి, యాత్మనాయకకమలాసహాయవేష
సముచితాలంక్రియాసంస్తుతమతిఁ గొనుచు... ౨౯౬

మహాకవులపోకడలు, పోలికలు:—

సీ. నవనవసృష్టివైభవహేమగర్భమై సత్యలోకంబుతో సరసమాడు
నార్యాంగనామనోహారనీలకంఠమై కైలాసనగరిశైఖరి వహించు
సంతతశ్రీనివాసస్ఫూర్త్యుదారమై వైకుంఠపురముతో వన్నెకెక్కు
సురుచిరాలంకారసుమనోనివాసమై సురరాజునిలయంబుసొంపుఁ గాంచు
సరససౌభాగ్యవిభవభాస్వద్విభూతు, లన్నియును గూడి వర్ధిల్ల నమరి యుండు
సతతసేవాగతాష్టదిక్స్వామిపాలి, కాపురంబైన యలద్వారకాపురంబు.

కుమారధూర్జటి, ఇందుమతీపరిణయములోని ౧-౧౪౧

సీ...గీ. జగతి వైకుంఠకైలాససత్యలోక, దిగ్వరపురాధిరాజమందిరనిభప్ర
భావభాసితమగుచు సంపదలఁ బొదలు, నఖిలవిద్యాకరం బయోధ్యాపురంబు.

సీ. కేళీరతకుమారికాళీకృతవిలాసపాళీరుచిరకుంజభాసురములు
సంగీకృతస్వానసంగీతమత్తసారంగీయుతసరోవిరాజితములు
నానామణిప్రభానూనాభ్రమణిపదాధీనామితాద్రిసమ్మానితములు
గంగానదీకీర్తిభంగానుగతమహాభంగాపగావళీసంగతములు
సురుచిరామరభూరుహాసుమవిరచిత, గర్భితవిరాగసురసతీకరపయోజ
లగ్నశాఖామహీరుహాగ్రగసుమములు, శోభిఁ జెలువొందు నచటి లీలావనములు.

కాళిం-౧.౧౦౦

సీ. లలనాజనాపాంగవలనాపసదసంగతులనాభికాభంగదోఃప్రసంగ
మలసానిలవిలోలదళసాసవరసాలఫలసాదరశుకాలపనవిశాల
మలినీగరుదనీకమలినీకృతధునీకమలినీసుఖితకోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతరనితాంతరతికాంతరణతాంతసుతనుకాంత
మకృతకామోదకురవకావికలవకుల, ముకులసకలవనాంతప్రమోదచలిత

కలితకలకంఠకులకంఠకాకలీవి, భాసురము వొల్చు మధుమాసవాసరంబు.
వసుచరిత్రము ౧-౧౩౬

ఇటువంటివిచాలఁగలవు.

ఇందున్న వేదసంప్రదాయము:—

(1) మోహాంబార హృదంబుజాంతరములో......
"సాహిశ్రీరమృతాసతా" మితివచస్సంపాదితశ్రీయుతుఁ... ౧ ౩౨

(2) సీ...శ్రౌతవాక్యస్థ నమః కేతుము ఖ్య, భేదకముల నుపపాదించు సూర్యునిఁ
జంద్రమః పద మని చదువు లేవె. ౩-౮౭

వేదాంతసంప్రదాయము :— ౩- ౨౧

సీ. నే ననిర్వచనీయనిజరూప మగు చనాదిత మెలంగుచుఁ దత్త్వధీ నడంచి
వెలయు నవిద్యమై మెలఁగెద మచ్ఛబలతఁ గాంచి మే యాత్మ బ్రహ్మమయ్యె
నటుగాన నాయందు నమరు కారణలక్షణం బతివ్యాప్తి దుష్టంబు గాదు
బ్రహ్మవిద్య యటంచు బలవత్ప్రమాణంబు మఱి గుహాశయత బ్రహ్మంబు నేన
యఖిలమును నాదురూపంబు ననుసరించి, నిలుచునో లేదొ చూడుఁడీనిఖిలజనము
లనెడి వైఖరి రోదసులాక్రమించి, యంధతమసంబువరఁగెభయంబు వెరుఁగ.

పరతత్త్వసాధనము:— ౧- ౨౭

సీ. తత్స్వరూపావాప్తి దనరు జ్ఞానంబున జ్ఞానంబు భక్తిచే సంభవించు
వేదాంతవిద్యచే వెలయును సద్భక్తి యవ్విద్య గురుసేవ నందవలయు
సద్గురుసేవ నిష్కామత్వమున నబ్బు నది చిత్తశుద్ధిచే నమరు నద్ది
కాలుష్య మణఁగినఁ గలుగుఁ దద్రాహిత్య మలవడుఁ బాపక్షయంబుగాఁగ
నట్టిపాపక్షయంబు మేలానవచ్చు, దాన యాగాది సత్క్రియ లూనఁగలుగు
నవియుఁ దన్నాశకరశక్తిఁ దవులుటరిది, కర్త నిష్కామమానసుఁ గాంచకున్న.

వ్యాకరణసంప్రదాయములు:—

1. అందుసంస్కృతవ్యాకరణము.

ఉ. వాచకశబ్దము ల్పరనిపాతముచే విలసిల్లు వాచ్యతఁ
రోచిలుమాకుఁ దాదృశత రుచ్యముగా కితరార్థరీతిగా
నాచితిగా దటంచు మదినారసియో శరపాతనక్రియ
ల్మోచి వసించు నప్పురి నమోఘబలాన్వితము ల్కరీంద్రముల్. ౧-౧౨౩

శా. ఊకారంబు సవర్ణదీర్ఘయుగళీ యుక్తంబు గావింపుచుఁ
జోకఁ హ్రస్వముఖస్వరాంకములఁ దా సూత్రంబున న్మాటిఁగా

వ్యాకర్తాముని మద్వచస్సరణి నుత్యంబన్నట న్మాన మం
చూఁకారాకృతి త్రిప్రకారముగ మోప్రియుం గాలవిన్యాసముల్. ౩-౧౩-౨

2. ప్రాకృతవ్యాకరణము:—

సీ. ...................

సిద్ధసాధ్య విశేషబుద్ధస్వరూపతఁ బ్రాకృతవ్యాకృతి (ప్రక్రియసఁగ) ౧-౧౭౦

గీ. ప్రకృతి ననుసరించి పరఁగును జగతిలో, వికృతి యిద్ది వింత వెలఁదియందుఁ
బ్రకృతి నడఁచి వికృతిప్రబలమై కనుపట్టు, సకలగుణసనాథ యజ్ఞనాథ.
౩-౧౬-౨

3. తెలుఁగువ్యాకరణము.

సీ ... ... ... ...

సరళస్థిరకళాప్రశస్తిసద్భావత సరసాంధ్రశబ్దశాసనమానంగ... ౧-౨౭౦

క. గుణవృద్ధు లగుచు రాజిలు, ఫణిరాజశయానుబోధలు పరికించుమను గా
గుణిగణము సక్రమే యిది, గణుతింపఁగ నక్రితమనో కాయాది యనుచున్.
౧-౩౧౯

ఛందశ్శాస్త్రసంప్రదాయములు:— ౧-౧౦౧

సీ. మత్తమయూరసమ్మత్తకోకిలహంసపదభృంగవిలసితభ్రాజితంబు
సాంద్రగతి త్వరాహాగరికుత్తస్నిత ముత్పలమాలికాయోజితంబు
బంధుగజాశిచంపకమాలికోపేత ముదుమణిగణాకీర్ణితంబు
జలనగమాలికాచాసమత్తేభవిక్రీడితారంభసంకీర్తితంబు
మంజులసుగంధిమాలినీరంజితంబు, ననమ శార్దూలవిక్రీడితాంచితంబు
లలితసుమగుచ్ఛపరిమళరాజితంబు, సుకవికవనంబునాఁబురిసొబగుఁగాంచు.

క. అమరెడుకీర్జన సగ్ధర, కొమరుమిగులుపిటుఁదు దేఁప గొనబగు విపులే
కమనీయతనుప్రచపలే, రమణీమణి యూరవృత్తరత్నాకరమే ౧-౨౧౫

ఉ. భవ్యతరంబుగా భరణభారవలంభితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతసుమనంబయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజిలును చైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యమదార్యనైఖరులు తెల్పఁగ నాకగునే విభాకరా. ౧-౩౦౫

జ్యోతిశ్శాస్త్రము:—

చ. కవిబుధచంద్రలోకహితకారకమంగళజీవ కేతుసై
భవత గిష్టాంశ్యరంబు గెడపం గడుఁ గూడిన "కాలసర్పయో

గవిధిఁ" బ్రకాశ ముందెడు నఖండలసద్భుజదండ కాండమై

భవముల నొప్పు మాధవునిఁబ్రస్తుతిసేయఁ దరంబె భాస్కరా. ౧-౯౯౪

క. శరము సుఖం బొసరు బుధ, స్మరణంబున జగతి నీకుఁ బొడమిన బుధవి

స్మరణంబు జగదుపద్రవ, శరణం బని యెన్న నయ్యెఁగా భువిఁ జంద్రా. ౩౮-౨

తర్కశాస్త్రము, ఇతరశాస్త్రములును:—

సీ. మానాదిషోడశమహితపదార్థశోధనవృత్తిఁ గల దను మునివరేణ్యు
సామాన్యముఖములౌ షట్పదార్థంబులు దెలియంగ నది యని పలుకువాని
గర్మవిజ్ఞానము ల్గలిగించు రెండెను నిశ్శ్రేయసం బను నేర్పుగాని
గర్మంబు జ్ఞానాంగగతి దాల్చు జ్ఞానంబు తారకంబనియెడు తాపసేంద్రుఁ
బ్రకృతిమహదాదితత్త్వసంపద్వివేక
మమర నిర్వాణ మని పల్కునట్టివానిఁ
జిత్తసంశుద్ధి యల(రారఁజేయు) వాక్య
పటిమ యలవడ హృద్వీథిఁ బ్రస్తుతింతు ౧-౧౮

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జిక్కుబండలాగి... ౧-౩౧

సీ. గౌతమమునిభావకలనచే నొకవేళ నొకతఱి కణచరానూనమహిమ
నురగేంద్రవృత్తిచే నొకమాఱు నొకతేపఁ గపిలవాచంయమోత్కటవిభూతి
వ్యాసవిజ్ఞానసంపత్తిచే నొకపరి నొకతూరి జైమినిప్రకటస్ఫూర్తి
వల్మీకసంభవవ్యాహృతి నొకయెడ నొకసారె భరతవాగ్వృత్తిమహిమఁ
బొద్దుపుచ్చును యునజవమొప్ప మమర, మేటియుప్పటిమేడల మేలుగద్దె
పంజరంబుల నెలకొని ప్రతియొకుఁగక, గణనమించిన శుకశారికాగణములు.
౧-౬౭

కావ్యము, కావ్యలక్షణము:—

క. నవరసఫలరుచిశోభిత, కవిరాజము సుప్రసాదఘటితము నగు మన్
ధవళాక్షి సమ్మతం బగు, కవిసత్కృతిఁ బోలు కేళికావన మొప్పెన్. ౨౧౫౧

సీ. క్లిష్టకల్పన లేక కష్టతాదూరమై యసమర్థత నెఱుంగ కప్రతీత
తనుమాని యప్రయుక్తతను రోసి పతత్ప్రకర్ష నైరర్థ్యకఘటన గనక
దృఢపదబంధసంధిస్థితమై సుప్రసాదకాంత్యోజ్జ్వల్యసమితి లలర
వస్త్వలంకృత్యభివ్యక్తులు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యము లనంగఁ
జెన్ను దైవారె చూడ్కి కచ్చెరువు మీఱఁ

బుష్యరథము లసంఖ్యము లొప్పిలుపుమిగులఁ
బురవతంసంబు ద్వారకాపురములోన. ౧-౧-౨౮

నాటకము :—

సీ. రమణీయనాయకరత్నబంధురంబు నవవిధవస్తునైభవయుతంబు
శ్రీకరాంకాంచత్ప్రతాకాభిరామంబు సుసుమంగళార్థపదోజ్జ్వలంబు
దివ్యత్ప్రపంచసంధిప్రోల్లసితంబు నీహామృగభిదానగాహితంబు
గగనావలంబివాక్యస్ఫూర్తిమహితంబు మధురవాక్యవిజాలమానితంబు
చిత్రసదలంక్రియాగఃప్రజ్జీవితంబు. నద్భుతరసాఢ్యపాత్రంబు నాత్తనాట
పాటనంబును నగు చొప్పి నాటకంబు
క్రియఁ బ్రకాశించు నొకదివ్యగృహ మొనర్చి. ౩-౧౯-౩

మఱియు నీతనికవిత్వమునందు సంస్కృతాంధ్రపదములు సమముగ నుండి మిగులఁ గర్ణరంజకములుగా నుండును.

సంస్కృతపదములకు :—

చ. పలికి గళన్మరందరసబంధురగంధసహంధబంధురా
కలితగనంబులం బ్రసవకమ్రవినమ్రరసాలమ్రతామ్రకో
మలసవపల్లవగ్రసన మంజులహాయితకంఠ కాకలీ
కలకలకంఠ నాదములఁ గల్కి తటాలున నుల్కి యుల్కియున్. ౨-౨౩౯

కేవలసంస్కృతశ్లోకము :—

శా. నేత్రద్విమ్యాలన మశ్రుచైత్యవిరతం నిష్కంపతాం స్విన్నతాం
గాత్రం యాతిచ హృష్టరోమచయతాం కంపైకసంపన్నతామ్
పాత్రం దుశ్చవిసంగతే ర్భవతి సద్వ్యక్తం చదైశ్వర్యభా
క్షిత్రాత్రప్రభవామనో స్పమజని గ్రీవా వ్యయోగక్రమాత్. ౨-౧౯౭

అచ్చతెనుఁగు :—

క. దొగదచ్చి లెక్కకెక్కగు
మొగములరాకాసిటేనిముద్దుంజెలిమే
ల్మిగనిగలు మిగులు మొగమున
సొగసులనగువగలునిల్ప సొగయనిదొరకున్. ౮-౭౭

సీ. పాలిమిన్కగమితెమ్మిపట్టు పట్టునంచ యంచతేజీతేనెఁ గొంచువేల్పు
వేల్పురాటాచాయ వెలయుచక్కనితండ్రి తండ్రి నెఱుంగకతనరుపోడ

పోరిడచేరువకొండరిఁ బోరుచుమిగాఁదఁటిగిడ్డి గిడ్డిమందలనుండుదొడ్డజంత
జంతరక్క-సికానదొంతు లేర్చెడుచిచ్చు చిచ్చుకన్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల సెకఁ జల్లఁ జూపుమేటి, మేటినుడివాలుదాల్చిన మేలుబంతి
బంతివలె వేరిల బలుకొండఁ బట్టిదిట్ట, దిట్టముగ నేలు నవ్వీడు తెలివిమీఱి
౧౪౧

ఉ. తావుల మోకమావిగమితావుల గొజ్జఁగనీరుయంత్రిమల్
కేరివలఁ జిల్కఁగాఁ జిగురుఁగేదఁగి పూదడిగట్టి పట్టివేర్
పైవఱలారు చెంగలువపందిరి చెందొవ రేకనంటి క్రొ
మ్మావులచందువాపొగడ మొగ్గలబిగ్గలచప్పరంబులోన్ ౨-౨౩౮

ఇందు యంత్రిముల్ అనుచోట జంత్రిముల్ అనఁదగును.

శ్లేషకవిత్వము.

గీ. అగు మహాపద్మపద్మశంఖాదినిధులు
కొలఁకు లిరవొంద నీలముకుందనిధులు
సౌధములు గుందనిధులను జాఱువనులు
వరనిధి యనంగఁ బురమంత వఱలుచుండు ౧-౮౨

సీ. గుణవృద్ధిపదవృద్ధగోత్రవిఖ్యాతమై పాణిని గ్రంథంబువలెను గాంచి
నానాత్మజీవవిజ్ఞానకారణ మగుచు నక్షపాదీయంబు ననుకరించి
కర్మజన్యాపూర్వధర్మప్రకాశమై జైమినివ్యాహృతిచ్ఛాయఁ బూని
సద్వైతసాక్షీణసమ్మోదహేతువై వ్యాసవాచాసృతి నన్ను కెక్కి
కవిత నవరసఫలకమై ఘటితమత్త, శిఖిమధు ప్రియోలసితస్ఫీత మగుచు
ననుకవిరాజకావ్యంబు ననుకరించి, చూడనింపొందు సదటి క్రీడావనులు
౧-౫౭

చ. సరసులపొంత హంసగణసంగతి సేయుచుఁ బద్మగహ్వరాం
తరముల నుండుచుం దనువు దాలుటకై భువిలో నదర్శన
స్ఫురణగఁ బుచ్చునీవు పలుచోటుల భిక్షుగొనియెదవు నీకు ని
వ్విరహులమీఁద నెట్లొదవె బెట్టుగఁ గ్రోధరసంబు భృంగమా. ౩-౧-౨౭

సీ. జారసంకల్పంబు దూలింపఁగాఁ జేసి చోటుల మూలకుఁ జొరఁగఁజేసి
సన్మార్గమెల్లను సుప్రకాశము చేసి పంకజావళిఁ బటాపంచ చేసి
యరిజాలములనెల్ల నండపాయఁగఁజేసి యాశ్రితద్విజరాజి నలరఁజేసి

పరతమోగ్రంథుల గిరిగుహాల్ సొరఁజేసి ధర్మసంస్థాపన దనరఁజేసి
ఖరకరుఁడు మున్ను చేసిన కాకఁ గాసి, యలరి సద్వర్గ మెల్లను మెలఁగ జేసి
కువలయానంద మొనరించెఁగూర్మిఁజేసి, యూర చల్లనిరాజు దీవ్యత్ప్రకాశి.

యమకమునకు:—౧- ౧౧౫ ౩- ౫౮

సీ. నగరాజు నైనఁ బన్నగరాజు నైనను ధైర్యవాక్పటిమలఁ దఱుమఁగలరు
రుద్రుని నైన సముద్రుని నైనను శౌర్యగాంభీర్యాప్తి జరుపఁగలరు
ఇంద్రుతో నైన నుపేంద్రుతో నైనను భోగభాగ్యస్ఫూర్తిఁ బోరఁగలరు
అర్జునితో నైనఁ జిత్రార్జునితో నైనను నిర్మాణరూపము ల్గెలువఁగలరు
ఘనులు నిర్వక్రవిక్రమక్రమమదారి, చక్రదళన క్రియావక్రజయపరాక్ర
మక్రియాముద్రనిర్నిద్రమద్రయశులు, శూద్రులప్పారిఁ గలరు విశుద్ధమతులు.

క. మృదుపద మై మాధుర్యాస్పద మై చెలిజంఘ రసము చాలఁగఁ జిలుకున్
మృదుపద మై మాధుర్యాస్పద మై యలరారు రచనపడుపు చెలిగ్వన్.

అనుప్రాసము:— ౧- ౯. ౧-౧౭..౨

సీ. తెలిమబ్బు బలునుబ్బు వడిగెబ్బు రుచి నబ్బురం బొసంగెడు వసనంబుతోడఁ
దెలిచొట్టు నలిగట్టు నెలిపట్టు నెలినెట్టు మేలిచాయలతోడి మేనితోడ
బలునేసితోవతేఁచెలువేఁదెగఁ బూనిసగఁబూనుచిఱునవ్వు మొగముతోడ
ననువంకగల పొంకమునఁగొంక కకలంక కాంతు లీనెడు ప్రువ్వఁగబ్బితోడ
హిడని యపార కారుణ్యదృష్టితోడ, నింపుగ వసించు నాహృదయంపుమేడఁ
దొంటిచదువులగమికాని యఁటిగరిత, గరితరతనంబ నాయంబ గుసునితంబ.

లోకోక్తులు నర్థాంతరన్యాసములు:—

అభ్యాగతః స్వయం విష్ణుః
లుబ్ధులకు సౌఖ్యం బబ్బునే స్వద్యుతిన్. ౪-౯ ౨
బడమతు లైన వారలకుఁ జక్కఁగఁ జిక్కెనె సద్విచారముల్. ౧-౧౭౦
ఉచితస్థితిఁగాంచ జడుండు నేర్చునే. ౪-౧౦౭
పూఁబోఁడు లధికసాహసలు గారె. ౨-౧౪౭
జడునకు విజ్ఞాన మబ్బు నెట్లు. ౩-౧౦౫
విధాతృఁడు విధించినకార్యము రిత్తవోవునే. ౩-౧౧౫
తొలఁగ దెచట బాధ రాగదోషత గొన్నన్. ౧-౩౦౭

వర్ణనలు :— అక్కడక్కడఁ గావ్యములలో నుండఁదగిన యష్టాదశవర్ణనములను జూపెను.

కథాంశము :— శ్రీకృష్ణుఁడు కాళిందీకన్యను వివాహము చేసికొనిన చరిత్రము.

కవి తా నాంధ్రవ్యాకరణమునకుఁ గొప్పవ్యాఖ్యానము చేసెను. కవిత్రయప్రయోగములకు మించిన దాఁటులు కొన్ని త్రొక్కినాఁడు. వానిలోని కొన్నిటిని దనవ్యాఖ్యానమున సమర్థించెను. అందు విసంధికిఁ గొన్నియుదాహరణములు:— ౩-౭ లో, నీవు-అరసి; ౧-౨-౨౫ లో, మంజుపదము-అలభుజంగప్రయాతము; ౧-౧౬ లో, పొరగలరు-అజుసిలోనైన; ౧ ౧౮ ౭ లో, గుబ్బల్-అప్రకృత; ఇట్టివిమఱికొన్ని గలవు. ఈవిషయమై తాను దనకావ్యమందు

౧-౯౭ లో "అసిద్ధోపమత విసంధితయు గుణతఁ బఱఁగ నరిదిగన్.

౧-౧౭౭ లో "మానదుకో విసంధితన్—" అనియుఁ జమత్కరించినాఁడు.

అహోబలపండితీయము 187 పుటలో "సంధ్యభావోపి నదోషాయ" "సంధి లేకుండుటయుఁ దప్పు గాదు" అని సమర్థించెను. చాప్రకరణముం బట్టి చూడ నీవిసంధి వాక్యాంతపాదాంతంబులందు దోషము కాదని భావమగు నట్లు తోఁచుచున్నది.

తత్సమాచ్ఛలకు సంధి:—

౧-౧౭ 3 సరసశైడకల, ౨-౨౧-౧ ఆపదేహసి, ౨-౧౩౩ మన సీలనేఁతదె, 3-౧3-౨ వ్యాకర్తోముని, ఇత్యాదులు చాలఁ గలవు. దీనివిషయమై అహోబల పండితీయము 189 పుటలో "సంస్కృతసమాంతస్థిత స్యాచోపి క్వచి త్సంధిః— (తత్సమపదాంతములందున్న యచ్చునకును గొన్నిచోట్ల సంధి రావచ్చును) "గంగనుకాసె- శ్రీరంగభర్తంచు-శౌరిచ్చుశుభములు. "ఇత్యాదికవిప్రయోగాత్—" అని యున్నది.

ఉత్తమపురుషైకవచననకారసంధి :—

౧-3-౨3 ఉదయమందితనంతపదంబుగంటి, అంటితిన్ + అనంతపదంబు.

౨-౨3౦ నిల్పితింతవడి, నిల్పితిన్ + ఇంతవడి.

3-౧౬౯ పోయితప్పుడు- పోయితిన్ + అప్పుడు.

దీనివిషయము, అహోబలపండితీయము 190–194 పుటలలో నిట్లున్నది.

ఉత్తమపురుషైతు "ప్రాయస్తు స్యాత్కిమాదిక స్యైతః" ఇతి సూత్రేణ

సంధిః చేసితినచ్యుతార్చనము=చేసితచ్యుతార్చనము" (ప్రైసూత్రిమున ప్రాయః అనుపదముచే) "కొలిచితినబ్ధిజన్ -కొలిచి తబ్ధిజన్, ఇత్యాదౌ విభాషేతి ప్రయోగశో వగంతవ్యమ్."

ఇంతియకాక, యీవిషయమునఁ గవిబ్రహ్మ తిక్కనసోమయాజి భారతము విరాటపర్వములో "సైరించి తీవ్రగాన (5-256) అని ప్రయోగించెను. దీనికి సంస్కృతభారతములో విరాటపర్వము ౭౧-౨౩ శ్లో. "అపరాధ మిమం క్షమే" అని యున్నది. తిక్కనసోమయాజికిఁ గృతియిచ్చిన కేతన దశకుమారచరిత్రములో ఆ. 7 పద్యము 52. (నేను) "పొందఁజేసితింక.....ఎడయాడ గఁజొచ్చెద." అనియును-పిదపఁ బ్రామాణికకవులలో నగ్రగణ్యుఁడగు నెఱా ప్రెగ్గడ- హరివంశము, ద్వితీయభాగము ఆ ౮-౧౬ లో "నేను దాశరథిప్రుడు" అనియుఁ బ్రయోగించిరి.

కూఁతురి:—౧ ౧ ౧ సాంప్రులకూఁతురి; 3 ౧౯ ౨, 3-౧౯౮ లో, కూఁతున్ అనియే యున్నది.

మున్నకలోపము:—౧-౨౧ శయ్యోపకరణసంసర్గ నిలిపి. ౧-౨౨3 స్పర్శ, ఇత్యాదులు గలవు.

పుంలోపము:—౨౮ శ్రీమాంబు

వి.అకోన్ని:—౨-౧౭౮ మాయునకు. ముఁగు (పీనులుముయువచ్చి) ౨-౧౧౮ కొస్సున నున్నగా సియదు ౨-౨౨౦ నెట్లగుబఁ గానిము. ౧-౨౩౦, 3-౧౭౭ మతల్లికి, మత్తల్లి- 3-౮౬ చఱకు-''చఱ కగువింటిబల్లిఁ గొని సారము జాఱఁగ"-చేరు, చారు మొదలగువానివలె రూపాంతరమున్నదా, కుమారసంభవము రెండవభాగము ౧౦-౭౮౬ అచ్చరువు అని యతియం దున్నది. ఇద్దాన లక్ష్యలక్షణగ్రంథముల నొక్కకవి రచించినప్పుడు రెండింటికిఁ బరస్పర విరోధ మున్నంతమాత్రమున నాగ్రంథము లొక్కరి రచియింప లే దనునూహ నిరాకరము.

౧౨౯౧ "బృంగితపించి తత్తనువు వీడిన" అనియున్నది, ఆగ్రంథమునందే షష్ఠాశ్వాసమున "బ్రింగి...భూధరము" అనియే యున్నది. కావున "బ్రింగి తపించి తత్తనువుఁ బోవిడి" యనుట సరళపద్ధతి.

౨-౧౧౭ గీ....దోస మేమి,యువతౌయోనియు వెన్నుని యువ్వనాఢ్య'' అని యున్నది, ''యెవ్వతెనియు వెన్నుని యవ్వనాఢ్య" అని తో.సవచ్చును గాని

యవ్వనపదము సంస్కృతసమాసమం దుపయోగించుట యశాస్త్రీయము కావున "అతివ యేదియు వెన్నుని యావనాథ్య" అని కాని "అతివ యెనతెయు వెన్నుని యావనాథ్య" అనికాని, లేదా "ఏవనితయేని వెన్నుని యావనాథ్య" అనికాని యనినచో సరిపోవును.

౨-౭౬ మాతృపితరులు అనుచోటఁ మాతరపితలు అనఁదగును.

ఛందోవిశేషములు:—

౨-౩౪ కాంతకు- తలపోంతలు- బలోకంతలు- గొంతలు- అని దీర్ఘపూర్వబిందుప్రాస మిందుఁ గలదు. కానియట "కాంతకు" అనుచోట మొదటిపాదమునఁ "నాతికి" అని సవరించినచో ఖర్వబిందుపూర్వకప్రాస మగును. మాతృకలోఁ "గాంత" కనియే కలదు. దీనింబట్టి దీర్ఘపూర్వకబిందుప్రాసము ప్రాచీనతమకావ్యలక్షణ మనువాదము ప్రశస్తము.

రలయతి :—౧-౧౦౧ లో- గీ, లలితసుమగుచ్ఛ పరిమళ రాజితంబు ౧-౩౬ లో - రాణకెంచిన నాయింటి లక్ష్మిరాణె ౧-౨౮౭ లెక్కఁసేగరాదు మాధురీగుణమనుచున్. ౨-౧౮౭ లలితనైఖరిగఁ జయు నల్లంబు గఁగ.

ఈవిషయము- అహోబలపండితీయము 137-38 పుటలలో సాధించుచు. "ఏతేన రాయంచకాళ్ళఁ దొలకయమున్న" ఇత్యాదికవిప్రయోగానాం న కించిద ప్యసామంజస్య మితి ధ్యేయం" అని తనభావమును సోదాహరణముగఁ బ్రకటించినాఁడు.

మువర్ణయతి:—

౨-౧౦ గీ। ర్పుప్మ్మొయి పైఁడిదున్వలువ మాఁత దలిర్పగ-

౨-౫౭ క. ముదమున లోకంబులెల్లఁ బొగడుట నిజమై-

౨-౨౧౦ ఇ। మ్మొదితకుఁ దత్పదానుగత భూరిభుజంగ విషాగ్నికీల- మొదలగునవి కలవు.

ఈకవి తనశృంగార ప్రధాన మగుమహాకావ్యమునందు శ్రీమహావిష్ణువు పరతత్త్వ మనియును (1-278) అదిసాధింప జ్ఞానభక్తులు సాధన మనియును (1-281) చెప్పి విష్ణుభక్తినిగుఱించి యిట్లు చెప్పెను.

సీ. బహుసంభవార్జితబహుపాతకవ్రాతవిపినమహావహ్ని విష్ణుభక్తి
మానసరాగాదిమాలిన్యపరిహారవిమలాంబుపూరంబు విష్ణుభక్తి
తాపత్రయోదారదావవైశ్వానరవిపులధారావృష్టి విష్ణుభక్తి

చతురర్థవిశేషసంపాదనక్రియావిదితాంజనంబు శ్రీవిష్ణుభక్తి
సకలసత్కర్మసాద్గుణ్యసంపదలకు, వేల్పుమొదవులమేల్బంతి విష్ణుభక్తి
సద్గురుకటాక్షసముపాత్తసాధుబోధ,విద్యలకు నెల్లఫలము శ్రీవిష్ణుభక్తి ౩-౨౦౨

ఈమహాకావ్యమునకుఁ బరిషత్తువా రెంత ప్రయత్నించినను రెండవప్రతి దొరకలేదు. దొరకినప్రతిలో లుప్తభాగము లున్నతావులఁ గొన్ని పూరించి వానికిఁ గుండలాకారచిహ్నము లుంచినాఁడను. లేఖకదోషము లధికముగా నున్నవి. కేవలము దుష్టము లని తోఁచిన వానిని దిద్ది మిగిలినవానికి మాతృకలోని స్వరూపములు క్రిందఁ జూపితిని. ఇది యాఱాశ్వాసముల గ్రంథము. ఈప్రథమభాగమందు మూఁడాశ్వాసములు మాత్రమే యున్నవి. మిగిలిన మూఁడాశ్వాసములును రెండవభాగముగాఁ బ్రకటింపఁబడును.

ఇందుఁగల మఱికొన్ని విశేషములును, ఉత్తరభాగవిశేషములును, ద్వితీయభాగపీఠికయందు వివరింపఁబడును. గ్రంథసంస్కరణమందును, పీఠికయందును గల గుణదోషములగుఱించి వేఱె మనవిచేయు నక్కఱలేకుండ నీమహాకవి పద్యమునే యిందుఁ బొందుపఱుచుచున్నాను.

ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పునియారస మానఁబోకుఁడీ
తప్పినఁ దప్పు గల్గె నని తప్పనిసత్కృప మీరు దిద్దుఁడీ
నొప్పొకింత గల్గ మది నుబ్బుఁడు పండితులార మీకు నేఁ
దప్పనిశిష్యుఁడన్ గురులఁ దప్పని శిష్యునకీర్తి కీర్తియున్ ౧-౨౯

ఇట్లు, భాషాసేవకుఁడు,

శ్రీపాద పాపయ్యశాస్త్రి,

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థానపండితుఁడు,

పీఠికాపురము.

# —: విజ్ఞాపనము :—

ఈ కాళిందీకన్యాపరిణయము మాతృక పరిషత్కార్యనిర్వాహక సభాధ్యక్షులగు మ॥ రా॥ జయంతి రామయ్యపంతులుగారు తాము డిప్యూటీకలెక్టరుగా నున్నపుడు వినుకొండతాలూకాలో సంపాదించినారు. కాగితపుఁబ్రతి ; ప్రాఁతగిలినది. నడుమ నడుమఁ గొన్ని పత్రములు లేవు, పద్యములు లేవు, పద్యములలోఁ గొన్నితావుల వాక్యములు లేవు, వాక్యములలోఁ బదములు లేవు. కొన్నిపదము లర్థముకాని విధమున లేఖకప్రమాదమున వైరూప్యముం బొందినవి. చూ పుట ౮౩ పద్యము ౩౫ "సంకుసకసద్గృహగ్రామసంకులంబు." ౩౧ పుట ౧౫౫ పద్యము "యశుయిగ్గుగుణస్ఫూర్తి" – ఇత్యాదులు. రెండవ ప్రతికై యత్నించితిమి, గాని, దొరకలేదు. ఉన్నదానితోనె యీ ప్రథమభాగమతికష్టముపైఁ బుస్తకరూపమున నింతమాత్రము ప్రకటింపఁగలిగితిమి. తక్కినమూఁడాశ్వాసములను గ్రమముగ ద్వితీయభాగముగఁ బ్రకటింప యత్నించుచున్నారము

ఈమాతృక శార్వరినామసంవత్సరము (శక ౧౮౨౨) ఆషాఢ బ ౨ భృగువారము వఱకు ప్రభంజనము వేంకటసుబ్బయ్యశాస్త్రిగారి కుమారుఁడు లక్ష్మీనారాయణగారు వ్రాసినది. రామయ్యపంతులుగారు వినుకొండ తాలూకాలోని ముమ్మడివరమున సంపాదించిరి, కాని, ప్రాఁతకాఁడు చివర—సీసమాలిక. శ్రీమించుచతూర్భుజసిరులకుఁబట్టైనకులిశాయుధునివీడుగొత్రైపాడు

ఆగ్నేయదిశయందు సఖలవేదాంతార్థమహిమకునిలయంబు మైలవరము
దక్షిణదిశయందుఁ దనరొలఁగూలంగఁ బెద్దజమ్మలమడక సౌజన్యమడక
నైరుతిపార్శ్వాన నరులనర్థులపట్ల పురుహూతుపుర మెట్ల పూరిమెట్ల
రాజిల్లుకొండలరాయనిపాలెంబు భోజనానకుఁ గల్పభూరుహంబు
వాయవ్యదిశయందు వనర గోకనకొండ చిరతార్థిజనులకు సిరులునిండ
ఉత్తరభాగాన నున్నతస్థితిఁగాంచె నాగులవరము భూనాగపురము
ఈశాన్యదిశయందు భాసిల్లుకీర్తిచేఁ గవికల్పవల్లి కూకట్లపల్లి
అష్టపురపద్మమంతరస్థాయియైన, శాశ్వతైశ్వర్యములకెల్ల సదనమైన
ప్రబలినారాయణపురంబు పాలకడలి, పట్టిమెడనున్న నవరత్నపథకమనఁగ.

సీ. జానకీపతి చేత సజ్జరొట్టెలపాలు కొంపలకప్పెల్ల గొడ్లపాలు
సంవాసములు దొంగజాగిలంబులపాలు నయనముల్ జాగరణంబుపాలు
గట్టిపాత్రపుఁద్రాళ్ళు కట్టెమోపులపాలు మృదువైనచేతులు ముండ్లపాలు
భూరిసంధ్యావిధుల్ బురదనీళులపాలు నాలుక దీనోక్తిమేనుపాలు
ఘనతరస్నేహ మది ధూర్తజనముపాలు, చిత్తమే వేళ నతిదీర్ఘచింతపాలు
హరిహరీ దేహమంతయు నలంతపాలు, మైదవోలున నుండుట మాకుఁజాలు.

అను రెండుపద్యములను వ్రాసియుంచెను. ఇందు ముమ్మడివరము కనఁబడదు. పైగ్రామములలో నక్కాలమునఁ బండితులు భాషాభిమానులు నుండెడివారేమో, కవివంశమువా రెవ్వరైనఁ గాని యితరులు గాని యీపుస్తకప్రతిని సంగ్రహించి యుండిరేమో యనునాశ కలుగుచున్నది. లక్ష్మీనారాయణగారు వ్రాసినప్రతికి మాతృక యేమై యుండును. ఎవ్వరైన నాప్రాంతముల వారీపుస్తకమునకై యత్నించి సంపాదించి మాకుఁ బంపి యీపనిలోఁ దోడ్పడుదు రని కోరుచున్నాము. ఇక్కవి పండితుఁడు, బహుశాస్త్రవేత్త, అట్టి యతనిగ్రంథమును యథామతిఁ బరిష్కరించుట సాహస మగును. మేము రెండవభాగము ముద్రింపఁబోవునప్పటికి దీనిప్రత్యంతర మెవ్వరైనఁ బంపినచోఁ గృతజ్ఞులమై యుందు మని విన్నవించుచున్నారము.

కార్యదర్శి,
ఆం॥ సా॥ పరిషత్తు, కాకినాడ.

# విషయసూచిక.

శ్రీరస్తు

# కాళిందీకన్యాపరిణయము.

## ప్రథమాశ్వాసము*

దప్ర ఁశపాత నెన్నెదన్.

సీ. నవరత్నకీలితనవ్యకంకణఝణత్కారికరాబ్జయుగ్మంబుతోడ
బంగారురంగులఁ బొంగార మెలఁగెడు కమనీయభూషితాంగంబుతోడఁ
జాయఁజెందగు(?) సేవసేయుకైవడి మేల నివసజంబుతోడ
ముఖకాంతిజలమత్స్యములఁబోలు కన్నులఁ జూబించు కరుణారసంబుతోడఁ
గానవగుచును నిజభక్తకల్పవల్లి, రామవామాంకతలభాసురతనువల్లి
మల్లికామృద్వి సీత (భామామతల్లి), కరుణ రక్షించు నను మహిమఁగన్నతల్లి.

సీ. రాముదేహమునకుఁ బ్రాపౌట నాత్మశేషత్వంబుఁ దెలుపు లక్ష్మణమహాత్ము
నతిశుచిగుణసంపదాస్పదత్వముఁ బూని నిజశంఖభావంబు నెఱపుభరతు
సద్వృత్తతామనో నిజచక్రరూపంబు మెలపు శత్రుఘ్నవీరు
నిజకన్యాభావంబు నిజసహోదరుమాని రాముఁజేరుటఁజూపురాక్షసేంద్రుఁ
గామరూపసమాసక్తిఖతలవృత్తి, నాత్మదివిజత్వ మంచఱ కాత్మమెఱయఁ
జేయుధన్యులనలయా(గజనేయము)ఖ్య, రామభక్తులమదిలోనఁ బ్రేమఁదలఁతు.

క. ప్రాజ్ఞుల విశ్వనిఁ బైజసుఁ, బ్రాజ్ఞుని సౌమిత్రి నేషు భరతాహ్వయునిం
దజ్ఞస్తుతు శత్రుఘ్నస,మాజ్ఞు స్మదినెంతు నిప్సితార్థము లొదవన్.

సీ. ప్రచ్యవత్సం(?) త్మవిరుద్ధవర్ణాలిసంరుద్ధ మగుచు
నప్రతీతం బౌచు నతివేలముఖ్యార్థహతిఁ బాచును బ్రకర్షహాని యగుచుఁ
†బ్రతిహతవృత్తమై ప్రక్రమభంగమై వ్యాకీర్ణవాక్యసంవాస మగుచు
నవిచారితవిధేయమై చరభిన్నమై హేయతాపన్న మగుచుఁ
గుకవికావ్యంబుకైవడిఁ గూలె లంక, యేమహాత్మునివాలాగ్ని యేర్పునపుడు
నతని సేవింతు రామనామైకపేయు, నానతవిధేయు ననఘాయు నాంజనేయు.

శా. లంకాలంక్ర . ణోల్లాసోరువాలాగ్ని ని
శ్శంకుం డై కపిసార్వభౌముఁడు ధరాజాతామనశ్శోకధూ
మాంకజ్వాల గతావశేషముగఁ జల్లార్చె న్విచిత్రంబుగా
నైంకర్యార్చితరామచంద్రుఁ డతఁ డుత్కంఠ స్వమున్ బ్రోవుతన్.

---

* మొదట గ్రంథపాఠము గలదు. †బహుశవృత్తమై-మూలము.

చ. జలరుహనాభనాభిజలజాతమధువ్రతభావ మూనుటం
గలిగెను గూఁతుకేల్గొనెడుకామన మాట వహించు టారయన్
జలరుహసూతి నీ కనుచు శారద తచ్చనలాడ మాటికిం
గలకల నవ్వ ధాత మెప్పడు మాకు నీవుతన్.

చ. కన దతిచిత్రత న్మృదులగాత్రమునం దొకగుబ్బ కర్కశం
బన దృఢసాహితీమయత నందుట మార్దవవాసగీతమై
తనరెడుగుబ్బ రెండవది దాల్చె దృఢత్వము చాల (వింతయా)
ననుచును మాటబోటికుచ మంటెడు నల్వ మదిం దలంచెదన్.

చ. అతికఠినంపుఁ దర్క మగునారయ నీదురదాళి తత్కృతా
హతులను సీత్కృతు ల్వొడమె హా మధురోష్ఠము బ్రహ్మకాం
లేని సౌఖ్యముల పట్టయి తేనది యానసంచు నే
యతివ మృదూక్తిఁ బల్కు విధి *నవ్వారవర్ణిని వాణిఁ గొల్చెదన్.

సీ. వెలిమబ్బుబలునుబ్బు వడి గెబ్బు రుచి నబ్బురం బొసంగెడు వసనంబుతోడఁ
దెలిచెట్టు వలిగట్టు వెలిపట్టు వెలివెట్టు మేలిచాయలతోడి మేనితోడ
బలుమేనితోవతేనిచెలువేని దెగఁబూనినగఁబూనుచిఱునవ్వుమొగముతోడ
నునువంక గలపొంకమునఁ గొంక కకలంకకాంతు లీనెడుపువ్వుఁగబరితోడ
పీడని యపారకారుణ్యవృష్టితోడ, నింపుగ వసింపు నాహృదయంపుమేడఁ
దొంటిచదువులగమికానియింటిగరిత, గరితరతనంబ నాయంబగురునితంబ.

చ. సిక నెలకొన్న (క్రొన్నెలను) సింగపుగొరని సారెకుల్కకై
మెకము నిరీక్షణద్వయము మేనకకూఁతురి బెళ్కుఁజూపుచా
యకు మరలించి దాని కుడియారని సిగ్గు ఘటిల్లఁ జాపల
ప్రకటత మానఁజేయు గిరిరాజసుతాశ్రయు నాశ్రయించెదన్.

శా. పంచబ్రహ్మసమాఖ్యపంచపృథివీవాక్యాదితత్త్వాధిపో
దంచత్పంచమహార్ణశోభితసురాధ్యక్షత్వసంశోభితుం
బంచాక్షర్యభిధానమంత్రవిదితుం బంచాక్షరాద్యక్షరా
కించిద్బోధితు సాంబు నేమనములోఁ గీర్తింతు (నశ్రాంతమున్).

చ. మగఁడు సగంబుగాఁ దపము మానక చేసియుఁ దత్ప్రియత్వముం
దెగఁగొని మేటిచట్టునకుఁ దీవ్రపుఁ గూరిమికూఁతు రేనియుం

*యావ్వారవర్ణిని-మూ.

దగు లగువారి నేరములు తాళుచుఁ గోరికె లెల్ల నీను నే
మగువలమేలుబాంతి (శాంభ)వి మమ్ము నేదుర్తన్.

చ. అతనువిభూతి నై నలఁదినంతన తద్విజయంబు గల్గ దే
సతనువిభూతిమూర్తిమతి నై యతనిన్ జయలక్ష్మి చెందఁగాఁ
బ్రతినవహించి తద్గతిని బాయక నాయకు నై సగంబు
సుందరీమణి మనంబున నెంతు నభీష్టసిద్ధికిన్.

గీ. వత్స మొక కేల నొకట ముప్పొంకకోల, శిరమునందుండు తెల్లచేసినజలంబు
పశుపతిత్వంబు నీకసంబంధమెట్లు, లనుచు గేస్తుని నగు చెలి నాశ్రయింతు.

మ. తృణ(తుల్యంబగు) బుద్ధిజాడ్యతమ మెంతే దూర మై పోవఁగాఁ
దృణమాత్రంబుగ విద్యలిచ్చి జడులన్ దీవ్యత్కృపం బ్రోచు లే
గుణమా నా కని ముజ్జగంబుల కసంకోచంబుగాఁ జెల్వఁగాఁ
దృణమాత్రాపచితిం బ్రమోదిలుమహా(దేవుం బ్రశం)సించెదన్.

శా. శ్రీరామాయణకావ్యకల్పలతికాక్షీరాంబురాశిన్ మహో
దారుం బ్రాకృతశబ్దశాసను గుణాధారు న్నమస్కారసం
భార ప్రక్రియఁ దృప్తిచేసెద మహాభారత్యఖండాన్వయో
(ద్ధారున్ స్ఫా)ర వచోవిలాసు మదిలోఁ దార్కొందు నావ్యాసునిన్.

గీ. ధరణి కేతెంచు కవితాభిధానహంసి, కతులవిశ్రాంతిభూము లై యద్రసజ్ఞ
లనెడిసరసులు క్రమమున నబ్బె నట్టి, యూర్యవర్యుల వాల్మీకి వ్యాసు నెంతు.

సీ. మానాదిషోడశమహితపదార్థ శోధనవృత్తిగల దను మునివరేణ్యు
సామాన్యముఖములౌ షట్పదార్థంబులు దెలియంగ నది యని పలుకువాని
గర్మవిజ్ఞానము ల్గలిగించు రెండును నిశ్శ్రేయసంబను నేర్పులాని
గర్మంబు జ్ఞానాంగగతిఁ దాల్చు జ్ఞానంబు తారకం బనిమెడు తాపసేంద్రుఁ
బ్రకృతి మహదాదితత్త్వసంపద్వివేక, మమర నిర్వాణమని పల్కునట్టివానిఁ
జిత్తసంశుద్ధి యల(రారఁజేయు)వాక్య, పటిమ యలవడహృద్వీథిఁ బ్రస్తుతింతు.

గీ.ముదము ద్రష్టకునొసఁగుచు మూలకార, మర్మభేదన మొనరించుమహిమగాంచు
నేమహాత్ముని దర్శనం*బిచ్చ లోనఁ, జాలఁబ్రార్థింతు నయ్యహిసార్వభౌము.

గీ. కూడు నెవ్వానిసద్వృద్ధి గుణనిబంధ, నంబు నాద్యంతముల వివృతంబు సంవృ
తంబు వివృతంబె కడసంవృతంబు మాన, నట్టిపాణినిమునిచంద్రు నాశ్రయింతు

సీ. త్రిప్రకారత నాత్మ దీపితంబుగఁ జేసి మూఁడుగుణంబులు మొనయఁజేసి
పటుతరజీవికోపాయవృత్తు లమర్చి సాంగరూపక మెసంగంగఁ జేసి

---

* బిచ్చలోన - మూ.

యుచితనానావర్ణయుక్తు లొప్పఁగఁ దీర్చి యుత్తమాధిక భేద మొసరఁ జేసి
మఱియు నలంకారమంజిమ ల్పొలయించి శయ్యాపకరణసంసర్గ నిలిపి
తెలివి శబ్దార్థమయకావ్యదేహరచన, చేసి నిర్దోషభావతఁ జేసి విధికి
నవమతియొనర్చు కాళిదాసాద్యనేక, సుకవిమూర్ధన్యులనుతింతుఁ బ్రకటసూక్తి

చ. ప్రకృతియుగంబు దీర్చుమునివర్యులకు న్నముఁ బైనపుణ్యుని
న్వికృతికి శిక్ష గాఁగఁ బదవిద్య రచించినవాని సంధ్రవా
క్ప్రకటకవిత్వకల్పతరురాజముబీజము సర్వవాక్యశా
సకబిరుదాంకనన్నవిచక్షణచంద్రు నమస్కరించెదన్.

గీ. ప్రాణివర్ణకతద్ధర్మభవ్యనామ, సరళపరుషామహస్సహాత్ స్థిరమయాంధ్ర
వాగ్జగత్కర్త భూకవివాగ్వినేతఁ, జాఁగి మ్రొక్కెద నల శబ్దశాసనునకు.

గీ. వికృతికాధారతవహించి వికృతరహిత, శుద్ధభావత బ్రహ్మంబుసొబగుఁ గాంచి
జగములోనఁ బ్రకాశిల్లు సర్వవిదులు, నన్నయాథర్వణాద్యుల సన్నుతింతు.

గీ. ఎన్న వికృతివివేకంబుఁ గన్నవాని, కమరు భావిక్రియాజ్ఞాన మనుచు జ్ఞాను
లభినుతింపఁగ వెలయు మహర్షితుల్యు, నన్నుతింతు నథర్వణాచార్యవర్యు

గీ. *సరసమతిశబ్దశాసనజాతమాత్ర, సంధ్రకవితాశిరస్సుంభ్రీతియమునఁ బెనిచి
చాలఁ బ్రౌఢ నొనర్చినచతురమతులఁ, దిక్కయజ్వాదికవులఁ గీర్తింతుఘనుల.

ఉ. అప్పటివారలే నుతుల కర్హు లనర్హులు సన్నుతింపఁగా
నిప్పటివార లన్న నది యెంతటిమాట యఖండపాండితుల్
దప్పని కారణంబు లగుఁ దద్భజనంబున కంచు నెంచి నే
నిప్పటిపండితోత్తముల నెంతు నిరంతరభక్తియుక్తతన్.

మ. గుణదోషంబులఁ దెల్పలేనిఖలులం గోపింపఁ గీర్తింపఁగా
నణువైనం బనిలేదు దోషములయం దత్యంతసాధుత్వముల్
గుణజాలంబుల దోషభావముఁ గడుం గూర్పంగ నేర్పొప్పు స
ద్గుణవత్పండితమౌళిసన్నుతిఁ గొనం గోర్కెల్మదిం బుట్టెడున్

ఉ. తప్పనిచోటఁ దప్పనుచుఁ దప్పనియారస మూనఁ బోకుఁడీ
తప్పినఁ దప్పు గల్గె నని తప్పనిసత్కృప మీరు దిద్దుఁడీ
యొప్పొకింత గల్గ మది నుబ్బకుఁడు పండితులార మీకు నేఁ
దప్పనిశిష్యుఁడన్ గురులఁ దప్పునె శిష్యునకీర్తి కీర్తియున్

---

*ప్రకటమతిశబ్దశాసనజాతమాత్ర. మం.ప్ర.మూ.

గీ. ఏమహాత్ముని దర్శింప నెసఁగు సత్తు, పాదకిణచిర జైమినివ్యాసమౌని
కపిలఫణిరాజదర్శనఘటితమోద, మతని మద్గురు మాధవు నభినుతింతు.

చ. కొదవ తెలుంగ కెప్పుడు నకుంఠమహాహ్లాదయుతై భవంబు వే
పొదలఁగ భూరిసత్కళలు పూని తమోహతిలేక యూర్జనం
బొదవఁ గళంకిత స్వదలి యూర్జితవాగ్మిజయోగ మింపుగా
మదిఁగొను మద్గురుం దలఁతు మాన్యుని మాధవయజ్వచంద్రమున్.

సీ. తర్కపాతంజలకర్కశప్రస్తరమండలంబున జీర్కబండ లాడి
గురుభట్టవాగ్గుంభగురుతరవనములో నింబుమీఱఁగ విహారంబుచేసి
యతులసాహిత్యవిద్యాచారుదీర్ఘికా లాలితక్రీతిచే నోలలాడి
కపిలసాంఖ్యవతేయఘన తంత్రవాక్సుధాధారలఁ గోరిక లారఁగ్రోలి
చెలఁగుయద్రసశోభామయలఁతమాలి, యతనిశ్రీరామచంద్రపాదాంబుజాళి
సుజనతల్లజసన్నుతసుగుణపాళి, నభినుతించెద మాధవయజ్వమౌళి.

శా. మోహాంబార హృదంబుజాంతరములో ముష్మాటికిం గొల్చెద
న్మోహాదిప్రతిషిద్ధదోషగుణసమ్మూర్ఛానిరాసక్రియా
సాహిత్యప్రతిపన్నచిద్రసఝరీసంబంధకృన్మానసు
,,న్సాహిశ్రీరమృతా సతా'' మితి వచస్సంపాదితశ్రీయుతున్
న్సాహిత్యాంబుధిపారగు స్సకలశాస్త్రజ్ఞు న్గురు న్మాధవున్.

గీ. ఎవ్వనియశంబుజగమెల్లనెనసిమట్టి, కొండయప్వలితమెల్లఁగొదనపఱుప
నల్పమాధేయమనిపల్కదధికభూమ, యతనికొనరింతునతిమాధవార్యమణికి

గీ. ఏకదినమేళనంబూను నెపుడుఁబూర్వ, పక్షలాలితిఁగొను గళల్పదియునాఱుఁ
దాల్చుశశి నవ్వు నుతచతుర్దశకళైక, హారిఁ బ్రార్థింతుమాధవయజ్వచంద్రు.

క. కవివాక్పతు లై యెవ్వని, సవిధస్థితు లైనపురుషసత్తము లెల్లం
గవివాక్పతులం గేరుదు, రవురా నుతియింతు నతని నస్మత్స్వామిన్.

ఉ. నైదుషి లేకయే కవిత వచ్చె నటంచు వచించువారలం
గా దనఁగూడ దెట్లనినఁ గాకవిపల్కెడు శాస్త్రవాగ్విసం
వాదిదురుక్తుల న్వినఁగఁ బండితపాళికి మోముడామరం
బ్రోదిగ నవ్వు వేనియలు పుట్టును రూపక మంగితం గొనన్.

గీ. దుష్టకవితి నిషేధించు దొరలసభలఁ, గలుగు పత్కవివరులకు ఘనయశంబు
తద్యశంబునకరయంగదాతఁయగుటఁ, బండితావమాన్యునకు నేని ప్రణతితగదె.

వ. అని యిష్టదేవతానమస్కృతియు సనాతనాధునాతన సత్కవీంద్రగురుచంద్రపురస్కృతియుఁ గుకవితిరస్కృతియు నొనరించి నే నొక్కబంధురప్రబంధనిబంధనాయత్తచిత్తుండ నగుచు, నిప్పు డొనర్పంబూనిన సకలసద్గుణాలంకారసంపన్నం బగునిక్కావ్యకన్యారత్నంబునకుం దగిన నాయకరత్నం బఖిలదేవతాశిరోరత్నం బగు శ్రీరామభద్రుం డగు నని పురాతనకృతసుకృతజనితమహాభాగ్యాతిశయంబువలనఁ దెలిసినవాఁడ నగుచు నప్రమేయప్రభావుం డగు నమ్మహానుభావునకు షష్ఠ్యంతంబు లగు పద్యంబులు విన్నవించెద.

క. వీరాదివీరునకు నని, వారితసద్ధైర్యశౌర్యవచ్ఛత్రుచమూ
మారణకారణదారుణ, భూరిబలోదగ్రునకును బుధితోగ్రునకున్.

క. మిత్రాన్వవాయనలినీ, మిత్రునకుఁ గటాక్షితాత్మమిత్రునకు ధుతా
మిత్రునకు వృత్రశత్రుజ, మిత్రతనూజాతశత్రుమిత్రాఖ్యునకున్.

క. మాయాగృహీతమానుష, కాయునకుం గుశికతనయకర్తృకయాగా
పాయపరపరహితాకుచ, నైయర్థ్యవితానకీర్తివరదాయునకున్.

క. రామునకు నింద్రనీల, శ్యామునకు నరాతిసోమసంవ్రాతఘన
స్తోమసమీరున కత్యభి, రామగుణారామునకును రఘురామునకున్.

క. దుగదచ్చిలెక్క కిక్కగు, మొగములరాకాసితేనిముద్దుంజెలిమే
ల్మిగనిగలుమిగులుమొగమున,సొగసులనగువగలునిల్పుసొగయనిదొరకున్

వ. అభ్యుదయపరంపరాభివృద్ధ్యర్థంబుగా లీలారాజన్యసార్వభౌముం డగుచు రామరూపంబునం బ్రకాశమానుం డగు నద్దేవతాసార్వభౌమునకు నంకితంబుగా నొనరింపఁ బూనినకాళిందీకన్యాపరిణయం బను మహాప్రబంధంబునకుఁ గథావిధం బెట్టి దగు నట్టివిధం బభివర్ణించెద.

—: కథాప్రారంభము :—

సీ. నవనవసృష్టివైభవహేమగర్భు డై సత్యలోకంబుతో సరసమాడు
నార్ధ్యాంగనామనోహరనీలకంఠు డై కైలాసనగరివైఖరి వహించు
సంతతశ్రీనివాసస్ఫూర్త్యుదారు డై వైకుంఠపురముతో వన్నెకెక్కు
సురుచిరాలంకారసుమనోనివాసు డై సురరాజునిలయంబుసొంపుఁ గాంచు
సరససౌభాగ్యవిభవభాస్వద్విభూతు, లన్నియునుగూడివర్ధిల్ల నమరియుండు
సతతసేవాగతాష్టదిక్స్వామిపాళి, కాఁపురం బైనయులద్వారకాపురంబు.

క. ద్వారవతీపదము ప్రశ, స్త్యారూఢ*మతంబుగాంచు నది సర్వమహా
దారసురాసురమానవ, పారము లేవేళ నర్థి†వసియించుటచేఁ.

చ. పగడపుదారబంధములుఁ బచ్చలచూరులుఁ బద్మరాగపుఁ
జగతులు వజ్రవప్రములు సానలఁదేఱిన కెంపుఁగంబము
ల్నిగడెడు నీలవేదికలు నిగ్గులుదేఱెడు రత్నవాటిక
ల్సొగసువహింప నప్పురము శోభిలుఁ బట్టణరాజరాజమై.

మ. ధర నప్పట్టణరాజ మంబరగతాత్మచ్ఛాయ నానాకముం
బరఁగం దోయధినీటఁ దోఁచుప్రతిబింబస్ఫూర్తి నబ్భోగిరా
ట్పురముంగ్రమ్మి త్రివిక్రమత్వమున నొప్పుఁ సాంప్రతంబేకదా
హరి యందుండుఁగదా త్రివిక్రమసమాఖ్యం బ్రీతచేతస్కుఁడై.

ఉ. మేలిమిరత్నదీధితుల మిన్నులు ముట్టెడు గోపురాళి నే
వేళఁ జరించుతమ్మునికి వేడుక నప్పురలక్ష్మి రక్షగా
నీలపురేకుఁగట్టె నది నేఁడును గానఁగవచ్చు దానినే
చాలనిబుద్ధి లోకము శశం బని పల్కును జందమామలోఁ.

గీ. వఱలునప్పురి బలితంపు వార్ధిపరిఖ, రత్నగర్భాదిశబ్దము ల్రాజిలంగ
నబ్ధిమేఖల గాకున్న ననువుగాద, టంచుఁ దద్భూషణాంబు భరించె ననఁగ.

క. అతిరుచిరచంద్రకాంత, ద్యుతిమై కవియుతము విబుధతోషాకరమై
హితసకలవస్తునికరో, ర్జితమై పురి కల్పవల్లిచెలువు వహించెఁ.

గీ. ప్రచురరోచిస్సమాలీఢబాడబంబు, భూరినవరత్నరాశిసంపూరితంబు
హరినివాసంబు చిత్రసత్త్వాశ్రయంబు, నగుచు నప్పురిజలరాశి నగుచునుండు

మ. రతికాంతాంతవిభూతి సంతతతనుప్రాంతోపగూహక్రియా
రతికాంతం బయి శేఖరామరధునీరమ్యాంబుసమ్మోదమై
ప్రతతైశ్వర్యవృషాంకమై నటన దీవ్యన్నీలకంఠంబునై
‡ప్రతిలేకొప్పు శివస్వరూపవిభవప్రాప్తిం బురం బెప్పుడుఁ.

క. సకలాలంకృత యయ్యుం, బ్రకటవిశేషోక్తి విబుధరంజన మగు హం
సకరుచిర పదంబై, యకలంకస్ఫూర్తి మీఱు నప్పురి జగతిఁ.

మ. ప్రకటౌదార్యవిశేషకాంతి సమతార్థవ్యక్తి సౌశబ్దరూ
పకసారాధికచిత్రచిత్రలిపిసంబంధంబు శ్రీకృష్ణనా

* మతుండుగాంచునదె-మూ. † వసియించుటయే. మూ. ‡ ప్రతి వేరొప్పు-మూ.

ధయక వైశిష్ట్యనితాంతభాసురము నై యష్టపట్టణం బొప్పుఁ జూ
నకలంకుల్ (ముదమం)ద సత్కవితఁ గావ్యంబుం బలెం జూడఁగన్.

క. హరిదశ్వుఁడు తనయరదము, సరణి పురీసౌధములను సంకటపడుట
న్వైర వమర నొంటిగుఱ్ఱము, సరదమునకు నేకచక్ర మమరించికొనెన్.

ఉ. పచ్చలగో(పురంబు) జిగి పచ్చిక యంచుఁ దలంచి వచ్చు లో
మచ్చికజింకఁ బట్ట వడి మై శశి యూఁకువ సేయఁ జంద్రుమై
నిచ్చలు జాఱు నయ్యమృత మించుక సోఁక సచేతనాకృతుల్
హెచ్చిన పైఁడిబొమ్మలకు నింతులకు (న్గనరావు భేదము)ల్.

సీ. గోపురోపరిశాలలకోకస్తనులగొప్పవిప్పకప్పుమిటారికొప్పు లబ్బు
రంపు మబ్బు లటంచు రమణుల నునుమేనుదీఁగెలు గ్రొమ్మించుఁదీఁగె లనుచుఁ
గరికరముక్తగంగాజలశీకరాసార లనుచుఁ
దదుదారతరబృంహితంబులు బలుగర్జితంబు లంచుఁ దలంచి యంబుధరము
లలనలువస్త్రాధికారమన్న్యలకునిచ్చె, విచ్చెమాగచ్ఛలనిమదినొచ్చినొచ్చి
వర్షగర్జితమిషము ములుక, వఱలు మేఘల క్రిందటనొఱలుచుండు.

చ. సురతరు లంతికస్థలులఁ జొప్పడ నందలి దివ్యభూషలా
తరుణు లొకప్డు డొక్కటియుఁ దాల్పఁగఁ జూడ రలఘ్య మాటచే.
సురుచిరభూష లొల్ల మటు చూచుచు భ్రమ నైనయు
త్తరువులపుష్పము ల్గొనరు తద్దయు వాడినవంచు నచ్చటన్.

ఉ. మేడలయందు నిచ్చలు భ్రమించుకలాపులు డాయఁ జూచి య
య్యేడుగుఱాల తేరియురగేశ్వరరశ్ములు వాఱ వాని వె
న్నాడఁగఁ గుంటిసారథికి నబ్బుమి వే పయనంబు సాగమిం
దోడనె తానె పోయి వడిఁ దోయజబంధుఁడు పట్టు రశ్ములన్.

చ. పడమటివెట్టకు న్వెఱచి భామలు తోరణగంప్లు మూయు న
క్కడ గతి నిల్వఁ గాక వడిఁ గ్రమ్మినఁ బోనిడఁ బోవుచుండఁగాఁ
గడుఁ గనిపించె మందగతి ఘర్మమరీచికి గ్రీష్మవేళ న
జ్జడత చిరార్జితం బగుట సంగత మయ్యెడు నిప్పు డేనియున్.

చ. పురిగరుడాశ్మసౌధరుచిపుంజము ఘాసమటంచు నెంచి లో
హరిణము చౌకళింప శశి యాత్మమనోహరవక్త్రపంకజ
స్ఫురదుపమానవృత్తిఁ గొనఁ జూడఁగఁ జాలక కజ్జలంబుచేఁ
దరుణులు కప్పెనర్చి రది తప్పక చందురునందు *నుండఁగన్.

* నిండుగన్ - మూ.

# ప్రథమాశ్వాసము.

క. బాలికల జాఁగుమాఁతల, వేళల సౌధములఁజుందు వెతికెదు వారిన్
లీలఁ గికురింతు రచ్చట, మేలిమిబంగారుబొమ్మ మెలఁతుక గొనుచున్.

క. అచ్చటి మదిరాక్షులు నై, యచ్చరికన్యకలు నాట లాడఁగ భేదం
బిచ్చఁ గనరయ్యెఁ జూపఱు, కచ్చపుఁగను రెప్పపాటు లందమిఁ గొనుటన్,

చ. అనుదిన మింద్రనీలమణిహర్మ్యరుచిప్రతతీతమిస్రసం
జనితమహర్నిశభ్రమాకులత సౌధగవాక్షముఖ ప్రచారస
త్యనుగతభేదము ల్పడల సంబుజపుష్పములు దక్షిణోత్తరా
యణములఁ బోయెఁ గాన నిపు డవ్వియె యూతని కిష్టమార్గముల్.

ఉ. మానితదివ్యరత్నగణమండిత సౌధతలంబులం దృషా
సీనత నుండు నెచ్చెలుల నిబ్బరపుగుబ్బలు డాయుసత్ఫల
వ్యానతకల్ప శాఖల ఫలావళిఁ దున్ముదు రంచితస్వర
త్పినపయోధరప్రతిమఁ దేఁగ రాఁగడు నీసుచేఁ బలెన్.

ఉ. వెన్నెలకుప్పలాగు నెడ వేలుపుఁబింతులు దీము నొల్పుచేఁ
గొన్నయనర్ఘ రత్నములు కోరికి మీఱఁగ నీరు మేడపై
నన్నపయోజగంధులకు, నొప్పఁగ పీరు జయించి వారిచేఁ
గన్నయనర్ఘ రత్నములు గల్గినవాట గ్రహింప నేమియున్.

సీ. కదుమీఁగలాసు సౌధములఁ గంజదళాక్షులఁ గూడి యాడుచును
న్మెడఁ గలసొమ్ము గన్గొనుచు మెచ్చుచుఁ గోరి దేవకామినులు
బ్బుడువఁగ లేరు వారిమది నూల్కొను కోరిక దీఱ భాషణం
బిడక మెలంగు నెచ్చెలుల వొందఁగ నొక్కతయోని లేదటన్.

క. అన్నగరిలోని వజిరవు, మిన్నాసౌధములు డాసి మింటం జనుచుం
గ్రొన్నెలతద్దుచు లెనయుచుఁ, బున్నమనాఁ డంటికొన్న పోఁడిమి గనియెన్.

చ. మృగమదచిత్రకంబు గొను నేలు మొగంబుల తేట చూడఁగా
మృగధరదర్పణంబు గని మీనవిలోచన లెల్లఁ దుల్యత
న్మొగములు గానరామి మది మూఁకొను నీసున నీకళంకిచే
నగు నిటు లర్ధబోధ యని యద్దము చూతురు వేడ్కమీఱఁగన్.

క. పిన్నలమెఱుఁగుఁ బలిగో, రన్నన్న యటంచు మెచ్చు చంబుజపాణుల్
క్రొన్నెలఁ బట్టుచు మార్దన, మన్నను తేఁదనుచు విడువ వరుగు న్నెలయున్

చ. అకచలితక్షురు మానుదురు లందము గాంచునొ కానలేఁ హో
యచరయుద నుంచు నెన్నుదురు లందము మీఱఁగ నందు నిల్పుచు

చ. తరుణీరత్నమనోజ్ఞకంఠనవరత్నస్ఫారహారంబు ల
చ్చెరువుం జక్కెరవింటికయ్యముల విచ్ఛిన్నంబుగా జాఱు న
వ్వరరత్నంబులు శోధనీముఖముచేఁ బ్రాభాతవేళం జెలుల్
శిగధిం జాప్పఁగ నూత్నరత్ననిధియ స్సంజ్ఞం గను న్వార్ధియున్.

చ. చెలువలు మేడలోఁ జెలిమిచే నిడుసొమ్ము భరించి వెల్వరా
చెలువలు చిత్తరంపడుచుఁ జెల్వగుసొమ్మది వేడఁబోయిన
న్వెలవెలఁబాఱఁ గల్పకము వేలుపుగిడ్డియు మోము మోడ్చెఁ గే
వలము ఫలస్వభావమున వర్తిలె నిర్జరలోకరత్నమున్.

శా. కేళీభూధరముల్ వరాజిలుఁ బురిం గేళీవిలోలాంగనా
పాళీచారుతనూపగీమిళిమిళత్పాథః ప్రపూరావగా
నాళీకాక్షులఁ గాంచి తోయనిధికి న్ననవ్యప్రమోదంబుగా
హేలిం బెండ్లి యొనర్చి పూర్వసరిదాశ్లేషంబు గ్రుక్కించుచున్.

క. ద్వారకచుట్టు మెలంగెడు, చారువిశేషమునఁ బద్మసాదరజాతో
దారనదులంటఁ దోఁచునబ్ధి, కోరికతోఁ గ్రొత్త పెండ్లికొడుకై యలరెన్.

క. అని పొందుచుఁ బుర్యందము, నిరతంబును నిర్నిమేషనేత్రములై
పరఁగెడుకన్నులఁ జూడఁగ, సురలు నిమేషంబు నిద్రసోఁకమియు బాపన్.

లయగ్రాహి. ఇందుమణివేదికలయందుఁ దొనరి యిందుముఖు
లందమగు గానముల నిందుమఱఁచు లెల్లం
బొందుగఁ గరంగనట సుందరపుమోముజిగి
చందములు చూచుకొని చందురునియందీ
చంగమగుపొందికలు చెందినవొ లేవొ కనుఁ
గొందమని చూచి బెళుకొందనము గంటుం
జెందదిది జింకసరి సందడిక నిందుఁడని
సుందరులు గేలిగయికొందురొగిపిటన్.

క. అర్థపతియైన సిరియో, యర్థిపదాన్వితకు నప్పురాగ్రణి నర్థం
బర్థుల వేఁడినయప్పుడె, యర్థులఁ జేయుదురు వారి నతిచిత్రముగన్.

చ. తెలుపగ నర్థివాచకపదంబుల గౌణత గాంచె దాతలం
బలుకుపదంబులొప్ప ముముఁ బల్కెడిశబ్దముకందు గౌణత
న్నెలఁగు నటన్న మేము మదిమెత్తుము వ్యత్యయమైనఁగాక యం
చలరుదు రందు దాతృమణు లద్భుతవస్తువితీర్ణసంపదన్

క. అతులప్రసాదగంభీ, రత లర్థవ్యక్తి మధురరసముల రసవా
క్తతులనఁగ సరసులొప్పె, న్సతతము సరసులకు మనము సరసతనలరన్.

శా. సాయంకాలనటన్మహేశజటాసంగంబుచే నావిల
ప్రాయంబై చని మానుగంగ యట సౌవర్ణాబ్జనాళుల్గన
న్మాయంజిత్త మిగుర్పఁ దత్సరసి యామిన్నేటిమిన్నౌ సిత
చ్ఛాయామేయఖగంబు లప్పురిసరస్సంవాసముల్ గైకొనున్.

ఉ. మేడల గాయనుల్ సిగుల మెచ్చఁగ గానము సేయఁ దచ్ఛ్రుతి
న్వేడుక నుండు *హూహూహుకయుపీడని వీణియదండ మప్పుడే
కూడి ప్రవాళవల్లి మదిగోలె ఘటిల్లఁ బ్రవాళసంజ్ఞ యా
జాడనె దండమాత్రమున సంధిలె నెన్నఁ దదాఖ్య యే భువిన్.

సీ. గౌతమముని భావకలనచే నొకవేళ నొకతఱి కణచరానూనమహిమ
నురగేంద్రవృత్తిచే నొకమాఱు నొకతేపఁ గపిలవాచంయమోత్కటప్రభూతి
వ్యాసవిజ్ఞానసంపత్తిచే నొకపరి నొకతూరి జైమినిప్రకటవృత్తి
వల్మీకసంభవవ్యాప్తిని నొకయెడ నొకపారి భరతవాగ్వ్యక్తిమహిమఁ
బ్రొద్దుపుచ్చును యువజనమోద మమర, మేటియప్పాటి మేడల మేలురత్న
పంజరంబుల నెలకొని ప్రతియొఱుఁగక, గణనమించిన శుకశారికాగణములు

చ. అతిమధురంబులౌ ఫలము లబ్బియుఁ బువ్వులు లేమి దుర్యశం
బతిఘనమంచు సర్వకుసుమాస్పదతం గని నన్నమాడ్కి మా
రుతగతిఁ బైకివచ్చిన తరుప్రసవంబుల రాజిలు న్స్వవ
స్పృతు లగునృక్షము ల్పురముపజ్జల నొప్పవనాళి నెప్పుడున్.

సీ. కౌశికనందారఘనతమైరావతభూషితం బయి సురపురముమాడ్కి
మాధవీపున్నాగమహనీయరూపమై ఫణిరాజభోగిపట్టణముఁగీతి
స్థితమహైమవతీకుమారకశివాస్పదమహాచుఁ గైలాసపదముకరణిఁ
బ్రచురప్రతానసపంకజాసనసదాలంబమై సత్యలోకంబువగిది
వెలయు నప్పురిలోపల వేలకొలఁది. యులసపవమానకంపితవిలసదసమ
కుసుమవిసరవిసృమరత్కుసుమరసత, రంగిణీపుష్పవాటినిరములు వనులు

సీ. స్వాత్మవృద్ధిపదవృద్ధగోత్రవిఖ్యాతమై పాణినిగ్రంథంబు పటిమఁగాంచి
నానాత్మజీవవిజ్ఞానకారణమహాచు నక్షపాదీయంబు ననుకరించి

*హాహా హూ

కర్మజన్యాపూర్వధర్మప్రకాశమై జైమినివ్యాహృతిచ్ఛాయఁ బూని
సద్వ్యక్తగాక్షిణసమ్మోదహేతువై వ్యాసవాచార్భటి వన్నె కెక్కి
కవితానవరసఫలకమై ఘటితమత్త శిఖిమధువ్రతవిలసితస్మితమగుచు
వసుమకవిరాజకావ్యంబు ననుకరించి చూడ నింపొందు నచటియాక్రీడవనులు

క. అమితధ్వనిసైచిత్రియుఁ, గ్రమహీనత్వాదిదోష (రహిత)ము వలి కా
వ్యమనఁగఁ బరఁగె నసిద్ధో, పమతి విసంధితయు గుణాశంబరఁగె నరిదిగన్

సీ. బహువిధాలంక్రియాపదనిజాకారమై యుపమోపమఁ బొదు నొప్పుగాంచి
కవితల్లజప్రౌఢి కవిశోక్తి ధుర్యమై యతిశయోక్తివిలాస మాదరించి
యుత్తరోత్తరసునస్వాగ్త్యలలితమై వాగ్భూషాగీతిఁ బొంకళించి
యనుపమశ్లమనోహరభావమగు చనన్యయభూషణంబు గర్వమునపూంచి
తనరు నుద్యానవిపినకదంబకంబు, శాఖశాఖాశిఖా పాతి జగ్గరితశ
శాంకతనుగళదమృతధారాకృశ్ర్రవ, వాహపూరితపిత తాలవాలకంబు

సీ. కేళీరతికమారికాళీకృతివిలాసపాళీరుచిరకుంజభాసురములు
నంగీకృతిస్వానసంగీతమత్త సారంగీయుతసరోవిరాజితములు
నానామణిప్రభామూర్తభ్రమణి పదాధీనామితాద్రి సమన్వితములు
గంగానదీకీర్తి భంగానుగత మహాభంగాపగావళీసంగతములు
సురుచిరామనభూరుహానుమవిరచిత, గర్భితవిరాగసురసతీకరపయోజ
లగ్న(శాఖవిహీరపాగ్ర)గసుమములు, గిమిఁ జెలువొందు నచటి లీలావనములు.

సీ. మత్తమయూర సన్మత్తకోకిల హంసపదభృంగ విలసితభ్రాజితంబు
పారిజాతోత్సాహ కుందీరునస్మిత ముత్పలమాలికారోజితంబు
బంధురజాతి చంపకమాలికోపేత మురుమణిగణికనార్జితంబు
జలధరమాలికా చారునుత్తేభవిక్రీడితారభస సంకీలితంబు
మంజుల సుగంధి మాలినీ రంజితంబు, వసమశార్దూలవిక్రీడితాంచితంబు
లలితసుమగుచ్ఛ పరిమళరాజితంబు, సుకవికవనంబు నా బురి సొబగుఁగాంచు

సీ పటునోపకృత కేశపాశతాడనములు బహుళకోపార్జితపాదహతులు
దోర్వల్లరీకృత తాఖర్వవేల్లనములు కందుకారచితసంఘట్టనములు
వక్షోజగిరికల్పితక్షోభణంబులు వక్త్రీణనఖరదంతక్షతములు
గాటంపు గండచపేటపాతనములు కచచయాంబరసమాకర్షణములు
బంధవిధములు మణితనిస్వానభిదలు, భాగవిపరీతగతులును బ్రబలియుండు
దత్పురంబున నిక్షుకోదండదండ, ధారికదనావసరముల దంపతులకు.

క. సరసధ్వను లుప్పొంగఁగ, వరగుణవిచ్ఛిత్తిగా నవారణ జాతిం
బరిమళితభూషణంబులు, సురతనిబంధనములందుఁ జోద్యమగుఁ బురిన్.

చ. సురుచిరచిత్రబంధములు శోభిల వాచ్యవిశేషనైఖరు
ల్కరముఁ బ్రకాశమంద రసగౌరవహాస నిదానదోషము
ల్పరఁగుట మానఁగా నవనవస్ఫుటచారురసధ్వను ల్పరి
స్ఫురణవహింపఁగా మిగులఁ జోద్యము లయ్యె రతిప్రబంధముల్.

క. చోరాభావమునో వ్యభి, చారితి పురి సడల రతులసాత్త్వికభావం
బా రాజధాని గైకొను, నారూఢస్ఫూర్తి దనర వ్యభిచారిగతిన్.

క. అమితరసము సంలక్ష్య, క్రమచేష్టలఁ దనరె వస్త్వలంకృతు లితర
క్రమతగయికొనియె నప్పురి, కమలాక్షుల కమనమదనకదనములందున్.

వ. మఱియు నప్పురీమతల్లిక రత్నాకరంబుఁబోలె ననంతసత్త్వాశ్రయం
రత్న సానుసానుమంతంబుకైవడి ననేక దేవతాయతనం బై కైలాసధరాధ
రంబుమాడ్కి రాజకుమారక వినాయక విరాజితం బై తుహినమహీధ్రం
బులీల సర్వమంగళోత్పత్తినిలయం బై యుదయాచలంబుతేఁ గళాధిపగా
ర్యమహోదయకారణం బై లోకాలోకనగేంద్రంబుపోలిక నిజాంతర్ని
ష్ఠద్రవ్యసాకల్యం బై సుధర్మాప్రదేశంబుకైవ సధర్మస్థితి వాక్పతిసురపతిదిశా
పతి సమధిష్ఠితం బై పద్మజువాస్థానంబు పోల్కి వేదాంత సిద్ధాంతగ పారా
యణపరాయణ సరస్వతీధరసమాక్రాంతం బై జలజోదరు నివాసంబుపగఁ
గమలాలయానంత శకుంతరాజ విష్వక్సేనాభిరామం బై కుబేరనగ
రంబునోజ మహాపద్మాదిసంఖ్యావిషయనవరత్ననిధితా ప్రథితం బై మానస
సరోవరంబుగతి రాజహంససంకులం బై ధరావలయంబుపోలువున జల
ధిపరివేష్టితం బై రాకాచంద్రబింబంబుచాడ్పున సకలకలామనోహరం బై
కంసవైరివక్షఃస్థలంబువడువున వైజయంతీ వనమాలికాలంకృతం బై
రవిబింబంబు వడుపునఁ గమలాసంకోచకర నిజోదయం బై తారామండ
లంబుభాతి విష్ణుపదపదం బై సత్పురుషహృదయంబురీతిఁ బంకలేశస్పర్శా
నభిజ్ఞతావిశదం బై మహోదారచిత్తంబుభంగి విత్తక్షయజ్ఞానరహితం బై
రసాతలంబు నైఖరి బలిపురుషనికేతనం బై దామోదరునుదరంబుగతి నశే
షవర్ణపరిపూర్ణం బై గౌరీరమణుకొల్వుకూటంబుతేట ధనాధిపవృషభశక్తి
ధగధతాపాలక సముపసేవితం బై సాకేతనగరిచాడ్పున రామచంద్ర సంబంధ

బంధుర రాజసదనంబై గంగాప్రవాహంబు పరిఖవంబునఁ ద్రిలోకీప్రసిద్ధగోపురంబై శ్రీమద్రామాయణంబురవళి సప్త కాండపర్యంతవ్యాప్తగోవిలాసంబై మహాభారతమునన్నియ బహుసుపర్వప్రతిపాదిత కథాప్రసంగం బై భాగవతంబునొంపున విపులస్కంధానుసంధానతంబై యాద్యప్రకృతివ్యాకరణంబునాగనుండ నుత్తమాదిపురుషవిఖ్యాతంబై ప్రకృతివ్యాకరణంబుగహిం సద్విగ్రహవంబై వికృతివ్యాకరణంబునహిం ననూన్యరూపంబై యుక్తిమత్కావ్యంబుచెన్నునఁ జమత్కారివ్యంజనంబై మహా* నాటకంబు చొప్పున నతిమనోహరాంకంబై దండనీతిఖ్యాతి సరాజలక్షణంబై గ్రహశాస్త్రంబు నందంబున బృహస్పతిశుక్రాదృష్టపదార్థంబై నతిప్రబంధంబు తెలివిఁ గావ్యాన యంగమంబై సాంఖ్యంబునాటిఁ బ్రధానప్రశస్తివిస్తీర్ణంబై యోగతంత్రంబు సరి సమాధ్యవస్థాహరణంబై ఛందంబుచందంబున లసద్వృత్తలక్షణంబై పాతంజలంబు నీమున నఖిలశబ్దాకరం బై నిగమంబుజోడున సత్యావచనప్రేమరంబై గీతశాస్త్రంబుపొందిక నకలంక కాంతపురుషరాగానుబంధం బై భరతశకున చక్రున ననుగృహీతాతిసర్వరసనిష్పత్తికం బై యాయుర్వేదంబు తోడున సన్నిధానసిధానంబై యాన్వీక్షకిచాడ్పునఁ బ్రకాశిత సకలపదార్థస్వరూపం బై పూర్వతంత్రంబు రీతి విభక్తాంగిక ప్రధానకార్యంబై యుత్తరమీమాంసజాడ సోహోపాసనాదం బై బ్రహ్మంబుతీరున నవాఙ్మానసగోచరంబై సవర్ణం బయ్యు సవర్ణం బై యపరభాగం బయ్యు సపరభాగంబై యనీతిప్రచారం బయ్యు ననీతిప్రచారంబై యదృష్టచరం బయ్యు నదృష్టచరంబై యశ్రుతపూర్వంబయ్యు సశ్రుతపూర్వం బై యబలాభిరామం బయ్యు సబలాభిరామంబై యైశ్వర్యంబులకు నావాసం బై యానందంబులకు నాటపట్టై మునిభిక్షులకు నవేద్యం బై యాచారంబులకు నాస్పదం బై యభిజ్ఞులకు నతిసుకంబై యాప్తులకు నధికశరణ్యంబై యగుణంబులకు నతిదూరం బై వెలయుచుండు.

సీ. వాదించిరా సృష్టి కాదట ప్రతిసృష్టిసల్పించి గెల్తు రాబ్రహ్మనైన
వెలయించిరా జగద్విఖ్యాతి నటకాలఁ గన్నుఁ జూపుదురు ముక్కంటికైన
మెచ్చిరా సంపద లిచ్చి సంరక్షింతు బలిదానులకు శ్రీపతికి నైన
నలిగిరా క్షోణిమండి నాసోశనంబుగాఁ ద్రావివుత్తురు జలరాశి నైన

* మహానాటకము. మహా. పరగణ.మహా.

చ. అరయఁగఁ గామితం బొకటి యైనను గానక యాచితార్థి నాఁ
బరఁగెడు నాదిభిక్షుకుని బంధువు సేఁడు గాన లుబ్ధతా
పరు నలకాపతిం గుమతిభావముఁ జెందును మమ్ము నందవం
చురుతరవర్ధితాఖిలజనోదయు లౌదురు వైశ్యు లప్పురిన్.

సీ. నగరాజునైనఁ బన్నగరాజునైనను ధైర్యవాక్పటిమలం దెలుపఁగలరు
రుద్రునైన సముద్రునైనను శౌర్యగాంభీర్యాప్తిఁ జరుపఁగలరు
ఇంద్రుతోనైన నుపేంద్రుతోనైనను భోగభాగ్యస్ఫూర్తిఁ బోరఁగలరు
అజునితోనైనఁ జిత్రజునితోనైనను నిర్మాణరూపము నెన్నఁబఁగలరు
ఘనులు నిర్వక్రవిక్రమసత్క్రమమదారి, చక్రదళనక్రియావక్రజయపరాక్ర
మక్రియాముద్రనిర్నిద్రమద్రయశులు, శూద్రు లప్పురిఁ గలరు విశుద్ధమతులు.

ఉ. ఏఱులమిన్న సయ్యమున నేరున భేదన మాచరించెఁ దా
నేసున దున్ని భూమి ఫలియింపఁగఁ జేయఁగ సీరపాణియు
న్నేరఁ డటంచుఁ గేలఁగొని నేర్పలరం గృషిచేసి ధాన్యము
ల్మేరకు మించఁగా ధర ఫలింప నొనర్తురు శూద్రు లప్పురిన్.

క. బ్రహ్మపదజనన మొనరుచు, బ్రహ్మనిరూపకపురాణపరత మెలఁగుచున్
బ్రహ్మారాద్ధగతి నెడసియు, బ్రహ్మారాద్ధగతి ఘటిల్లఁ బరఁగిరి శూద్రుల్.

క. మాతోఁ బుట్టిన గంగయు, ఖ్యాతిన్ జనములకు ముక్తి గలిగించెను మా
చేతనె భుక్తియుఁ గలదని, ప్రీతిం జెలఁగుదురు దత్పురింగల శూద్రుల్.

మ. సిరి విద్యుల్లత చంచలత్వ ముడిగెం జెన్నారె నేవేళలం
గర మింద్రోపలనీలకాంతులు నిజాకారంబునన్ మా(కుసి)
కరణిం గావలె నంచుఁ గృష్ణఘనముం గాంక్షించి సేవించు న
బ్బురపుంగారుఘనంబులో యనఁగ నొప్పు న్వీట మత్తేభముల్.

చ. జగములు రెంట విష్ణుపదసంగతి గాంచె నిజాధినాథుతో
గగనమువాఁక యవ్విధము గాంచక పోవుట గాదటంచు వే
గగనధునీజలంబు కరకాండములం గొని తెచ్చి నించి ప
ట్టెగలగు నేఱులన్ జలనిధిం గనఁజేసె గజంబు లప్పురిన్.

చ. సురధుని నోలలాడు సురశోభనగాత్రలయూరుసౌష్ఠవం
బరుదుగఁ జూచి లజ్జపడి యాత్మకఠోరకరంబు లెల్ల ని
ర్భరముకుశాకృతుల్ గొనఁ దరం బగునే గ్రహియింపఁ దత్పురీ
కరులకు నట్లు గాని యెడఁ గైకొనవే యవి నీర మంతయున్.

ఉ. వాచకశబ్దము ల్పరనిపాతముచే విలసిల్లు వాచ్యతన్
రోచిలు మాకుఁ దాదృశత రుచ్యముగా కితరార్థగీతిగా
నౌచితి గా దటంచు మది నారసిరో పరపాతిసత్క్రియ
ల్పోచి వసించు నప్పురి నమోఘబలాన్వితము ల్కరీంద్రముల్.
శా. పీటం బాటిలు ఘోటకావళుల యుద్భిన్నాంఘ్రివేగింబుతో
సాటిం జెందఁగ వచ్చి వాయుమనము ల్సత్త్వంబులే కయ్యెడ
న్నీటు ల్పోవఁగఁ దత్పదాహతరజోనీకంబుచే సుళ్లఁ జే
డ్పాటుం జెందె నవేసుమీ భ్రమరజఃప్రాబల్యము ల్వానికిన్.
క. ఏకకచక్రపుఁజక్రిన, నేకత గాంచియు వహింప నేరక పుడమిన్
జోకటి పడు నని నగు నగు, లోకాప్తనిహారుల ఫేనరుచుల హయంబుల్.
చ. సురుచిరరాజకన్యకల సోఁకుట నిత్యము రూపభావముం
బొరయుట జన్మసంశ్రయతఁ బూనుట నిక్కముగాఁ బిశాచ్యమై
పరఁగెడుగాడ్పు వేగమునఁ బొల్పడునే సరిగాఁగ మాకు నం
చుపగతివేగసంపదల నొప్పు నదుష్టములై పురిన్ హయుల్.
క. అరయఁగ నెప్పుడుసత్త్వము, భరియింపనుమనసు లక్ష్యపదమాయఁను వే
సరి యొట్టు లౌ సటంచు, న్హరు లప్పురి మొలఁగుచుండు నతిసత్త్వమునన్.
సీ. క్లిష్టకల్పన లేక కష్టతాదూరమై యసమర్థత నెఱుఁగ నప్రతీతి
తను మాని యప్రయుక్తతను రోసి పత్రప్రకర్షనైరర్థ్యనుటన గనక
దృఢపదబంధసంధిస్ఫీతమై సుప్రసాదకాంత్యౌజ్జ్వల్యసమత లలర
వస్త్వలంకృత్యభివ్యక్తులు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యములనంగఁ, జెన్నుమీనాటిచూడ్కికి నొప్పుమీఱఁ
బుష్యరథము లసంఖ్యము ల్పొలుపు మిగులఁ
బురవతంసము ద్వారకాపురములోన.
క. అచలత నవరత్నరుచి, ప్రచురత చిత్రప్రకారబహుసురపునస
ద్రచనతఁ బురిలో నరదము, లచలాధీశ్వరులమాడ్కి నలరుం జాలన్.
సీ. వెలఁది నీక్షైదండవెల యెంత తెల్పవే యలరునాక్షైదండవెల సులభమె
చను బంతు లీరెండుఁ గొనవచ్చు చెలువరో చనుబంతులీరెండుగొనఁగ లేవు
ఆకాశసుమ మిదెం తబ్రమే కననీయ వాకాశసుమదృష్టి యబ్రమొకద
పలునొక్కులకుఁ బొలుపడెఁగదే చిగురిట్టి పలునొక్కు లిడఁగ నీపాలిగాదె

వింత తావులు గనంగ నువ్విళ్లు మాకు, వింత తావులు గన .. . వెంతవాఁడ
వనుచు విటులకుఁ దమకు సయ్యాటమమర, విక్రయింతురు పుష్పలావికలు విరులు.

సీ. వలపులీనంగ సోఁగుఁ జెలువ నీకైదండ వెల చెప్పరావ వలయు మాకు.
వనిత పుంస్కోకిలాస్వాదితం బీనన రుచి చూడనీఁగదే రుచిరగాత్రి
పోలంతి పూఁటంగ నేల పొన్నపువ్విది మాకుఁ జెన్నారు వన్నె చేమిన్న ముట్టి
వలువలో డాఁచెదు వలుదపూబంతులు పుట్టినయవి గానఁ బుట్టె మనసు
అనుచు నాగరవిటులు నర్మానుబంధ, బంధురంబుగఁ బల్కెడుపల్కులాని
గోముమీఱిన నవ్వుల మోము లలర, నమ్ముదురు పువ్వులవ్వీటనలరుఁబోండ్లు

ఉ. పోయినవారిఁ దేవసమె పుత్తడిబొజ్జకునైన మాదు చూ
చాయల చాయనే చనిన చక్కెరవిల్తుని చాయ నెన్నికం
బాయఁగఁ జేయు లక్షణకుఁ బొల్పగు మాయబలాక్షిపదం బనం
జాయ విటాళి లోఁగొనుచుఁ జక్కని వేశ్యలు పొల్తు రప్పురిన్.

చ. సతతగిరీశభావమున సమ్మతశుద్ధకళావదాఖ్యసం
గతశివమూర్తియైన నధికస్ఫురదక్షికటాక్షవీక్షణాం
చితగతిమాత్రనే రతివిశిష్టపరంపర లీను నిక్కవం
బతిశివమూర్తు లంచు విరులందఁగ వేశ్యలు పొల్తురప్పురిన్.

సీ. చందనాలయమహాచలరాజరాజత్సుగంధచందనగంధకలన మీఱి
నానామహీరుహానూనసవ్యామోదసుమగుచ్ఛపరిమళస్ఫూర్తిఁ దనరి
రసరమ్యపద్మినీ*రాగసంగమపరిప్రాప్తంబు మధుసేవఁ బరిఢవిల్లి
సకలనఘాటికాసముదయాశ్రయకామసంతతాధారతాసరణి నలరి
మెలఁగు మందేచు మేనుమ మేను నెడమ, నతులభీతిని బలెమందగతులు సాగియు
నప్పురంబునఁ జరియించు నహరహంబుఁ, బట్టణగుకొని మ్మదుమరుద్బ్రహ్మచారి

సీ. శక్తిత్రయజ్ఞానసంపత్తి నలరారి పంచాంగనిర్ణయప్రౌఢి మెఱసి
‡యావాస్యతంత్రకార్యక్షమత్వము గాంచి వృద్ధిక్షయంబులవిధము తెలిసి
చతురుపాయవిచారచాతుర్య మిరవొంది షడ్గుణాస్త్రజ్ఞాప్రశస్తి నెరసి
రాజ్యాంగసప్తకరక్షకస్థితు లూని ద్వాదశరూపవిభేద మరసి
మతిబలస్ఫూర్తి నలబృహస్పతికి మించి, యఖిలవిద్యల నెచట †సామ్యంబు లేక
యప్పురంబున నలరుదురనుపమాన, మానగుణరత్నఖనులు ప్రధానవరులు

* శతదళ... — మూ. ‡ ... — మూ. ‡ ... — మూ. † నామ్యంబు — మూ.

క. ప్రథమానిర్దిష్టతఁ బ్రా, గ్ప్రథగణ ముపసర్జనత్వబోధకు నమగుఁగ
ప్రథమానిర్దిష్టతి నగు, ప్రథ నుతధన్యత్వ మొనరఁ బరఁగి రమాత్ముల్.

వ. ఇట్లు సకలపురుషలక్షణలక్షితం బై నిఖిలలోకవీక్షాపేక్షాసేచనకం బగునప్పు
రంబున ధరానుకూలవల్లరీనాయకరత్నం బెవ్వ రనిన.

చ. కలఁగనివాఁ డదెన్నఁటికిఁ గాననివాఁడు జగద్ధితార్థి యై
కలఁగనిమానవప్రకృతిఁ గాంచినవాఁడు నిజాశ్రితాభిదా (?)
గలకని యైనఁ గావనను కట్టడిమాటకుఁ గానివాఁడు మే
ల్కలఁగనిచాయ నవ్వఁగనుగల్గిన నిద్దపుమోమువాఁ డొగిన్.

ఉ. తప్పనివాలువాఁ *డనిని దప్పనిమాటలవాఁ డొకప్పుడుం
దప్పనివాఁడు నమ్మికలు దప్పనిబంతి మెలంగువాని వె
స్దప్పనివాఁడు తప్పులకుఁ దప్పనివారలఁ బ్రోవనన్నవా
తప్పనివాఁడు ద్వారవతిఁ దప్పనినీతిగ నేలు నెప్పుడున్.

సీ. సచ్చిదానందలక్షణలక్షితుం డౌచు వేదాంతలక్ష్యత వెలుఁగు నెవఁడు
జగదుద్భవస్థితిసంక్షయహేతుత సర్వజ్ఞతాతిప్రశస్తిఁ బఱఁగు నెవఁడు
మాయానుబింబితమహనీయతేజుఁడై క్షేత్రజ్ఞవృత్తిచేఁ జెలఁగు నెవఁడు
సేవకాభీష్టార్థసిద్ధ్యర్థమై బహురూపనామముల నిరూఢిఁ జెన్నఁ
డతఁడు పరముండు సకలలోకానుశాస, నార్థమయథార్థమనుజవేషాఢ్యుఁడగుచు
గృష్ణుఁ డనునామ మఘవనకేళి గాఁగ, నతిముదంబున ద్వారకనధివసించు.

సీ. ప్రామిన్కుఁగమితమ్మిపట్టుపట్టుగునంచ యంచతేజీఁ జేనిఁ గాంచువేల్పు
వేల్పురాఱాచాయ వెలయు చక్కనితండ్రి తండ్రి నెఱుంగక తనయుప్రోడ
ప్రోడ చేరువకాండ్రఁ బ్రోచుమీఁదటిగిడ్డి గిడ్డిమందలనుండు దొడ్డజంత
జంతరక్కసికానదొంతు లేర్చెడుచిచ్చు చిచ్చుకన్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల నెకఁ జల్వఁ జూపుమేటి, మేటినుడివాలుఁ జాల్చినమేలుబంతి
బంతివలె వ్రేల బలుకొండఁ బట్టుదిట్ట, దిట్టముగ నేలు నవ్విడు తెలివిమీఱి.

సీ. తనసుదర్శనలీల తనసుదర్శనలీలకరణిచేఁ బరదానగరిమ మెఱయఁ
దనవిక్రమస్ఫూర్తి తనవిక్రమస్ఫూర్తి యనువున జగముల నాక్రమింప
దననేత్రమహిమంబు తననేత్రమహిమంబుపగిదిఁ జిత్రాలోకపటిమ నెఱప
దనకరాంభోజంబు తనకరాంభోజంబుపోల్కి నసాధ్వసామోదము లిడ

*డనిని.

ద్వారకాపురిశ్రీలను బారసంరింపు, మహిమల యుభారముపంగా మనుజలీల
నతిశయిల్లుచుఁ ద్రిజగంబు సంరక్షింపు, నాయకుండగు నట్టినారాయణుండు.

సీ. సగుణశిఖాపద్మినీచారుహంసంబు నిరవద్యసద్గుణనీరరాశి
నిజదాసపక్షదావాగ్ని నిరస్త‡నాంభోదంబు నిర్మలకీర్తిఘనసీమహాద్రి
నిఖిలార్థదానవినిర్జితభూమిజంబు నిరుపమవైభవనిత్యసతతి
నిరవధికానందనిలయతీనివాసంబు నిటలదృక్ప్రముఖసురనికరచేత
వలగు ద్వారకాసగ్గలోకాతిశాయి, చాతురీలేశ(హత)బహుళాతతాయి
(సాధు)చేతసమానసౌత్సవవిధాయి, మాయిజనమాయివిబుధసన్మానదాయి

సీ. పైసింధనబలమధ్యసంగాగ నుండుట గిరిధారణోద్దీప్తకీర్తిఁ గనుట
భూదారభావంబుఁ బొందుగాఁ బడయుట నరసింహవేషంబు నలువుకొనుట
బలిదైత్యగర్వసంపత్తి హరించుట రక్తైకతర్పణరతి నెసయుట
ఖరదూషణోద్వృత్తికలిమి వారించుట నిజకామపాలత నెఱి మెలఁగుట
సుగతిపరఘాతిగతుల సన్నుతిగలుగుట, నగులితంపుఁ బ్రసాదిత్వమానిమనుటఁ
బూర్వపరలీలలస్పృడ ప్రాసికొనుచుఁ, గృష్ణుఁడలవారునధికరోచిష్ణుఁడగుచు

సీ. నెనరుఁజూపులవాఁడు గానునానిఁగనునానిఁగనునానిఁగనినరూపౌనరువాఁడు
పౌనరునవ్వులవాఁడు మొనమించు మొనమించు మొనమించుజిగివల్వనెస [యువాఁడు
భంగ మందనివాఁడు రంగారు బంగారు బంగారుఁబోఁడి చేపడినవాఁడు
కనలినసుండవాఁడుతడప్పులుకడప్పులుకడప్పులుమహిమంబుగాంచువాఁడు
కలఁడు లేఁడను రెండుమాటలకు మించి, వింత యగుకల్మిచే విఱ్ఱవీఁగువాఁడు
కృష్ణుఁడను పేర నఘు మణఁగించువాఁడు, పురుషుఁ డాద్యుండు ద్వారకాపు [రికి ఱేఁడు.

వ. వెండియు జగజ్జన్మాదికారణం బైన యప్పురుషోత్తముండు నిఖిల*విశ్వంభరాభారోపసంహారార్థంబుగా దేవకీవసుదేవులకుఁ బుత్త్రభావంబున మాయామానవశరీరం బవలంబించి యుతం డునుప నందయశోదానందకందం బై నందునిపల్లియయందు యశోదాతపఃఫలాయమాన నిజశిశుశరీరపోషణుండై వసియించుచుఁ దత్కాలంబునఁ బూతన విగతచేతనం గావించి శకటాసురు హరించి తృణావర్తు నడంచి నిజైశ్వర్యజ్ఞాపక విశ్వరూ

‡ నాంభోజంబు — మూ. * విశ్వంభరాభారా భరరోషనం — మూ.

పయఃప్రదర్శనాద్యద్భుతంబుల యశోద కు విస్మయానందంబుల నొదవించి యమళార్జునంబుల భంజించి బృందావనంబున గోపాలబాలక బలరామసహితుండై గోవత్సపరిపాలనం బభ్యుపగమించి వత్సాసురు విదారించి బకదైత్యు మర్దించి యఘాసురు ఖండించి చతుర్ముఖమాయావినిర్మిత గోగోపవత్సాపహరణనిమిత్తంబునం దాన గోగోపవత్సరూపంబులు ధరించి విహరించి ధేనుకు మథించి యమునాహ్రదంబున నుండు కాళీయోరగంబు వెడలించి దవానలంబుం గబళించి ప్రలంబునకు బలునిచే లయంబు ఘటియించి గోపకన్యాసహస్రక్రీడనం బంగీకరించి విప్రభామలం గరుణించి గోవర్ధనాచలం బుద్ధరించి సుదర్శను శాపవిముక్తుం గా నియమించి శంఖచూడు జముం జూడం బంచి వృషభాసురు మాయించి కేశిదైత్యు* మాయించి వ్యోమాసురు నిర్జించి మధురాపురంబునం గువలయాపీడమహాగజంబుం ద్రుంచి కుబ్జావక్రతానివారణాద్యద్భుతకృత్యంబులు నిర్వర్తించి బలరామసహితుండై ముష్టికచాణూరుల నిగ్రహించి కంసన్యగ్రోధనాది నృపాంగసుల హింసించి యుగ్రసేనుం బట్టాభిషిక్తుం గా ననుగ్రహించి ‡ ప్రస్థానాదితోరీకరణపూర్వకంబుగా సాందీపుని సమీపవర్తిత్వం బనుసరించి పంచజనుం గీటడంచి తద్దేహగతశంఖంబు ధరియించి జమునివలనం దెచ్చి గురుసుతుం బుత్త్రు నర్పించి యక్రూరముఖంబున గోపికల ననునయించి జరాసంధుం గాందిశీకుంగా ఘటియించి కాలయవనపరిత్రస్తమధురాపురజనావనార్థంబు వార్ధిమధ్యంబున ద్వారకానగరంబు విశ్వకర్మనిర్మాతచే నిర్మింపించి యందుం దన యోగమాయాబలంబున మధురానివాసుల నందఱం బ్రవేశింపించి ముచికుందుచేం గాలయవనుసమయసంకల్పించి ముచికుందుం గృతార్థసార్థనాహుంగా నభిమతించి జరాసంధుం బునర్దండయాత్రానిమిత్తక ప్రవర్షణాపర్వతారోహణానంతరంబ తద్గిరిదాహంబు గావించి బలరామసహచరుండై ద్వారవతియందు నివేశించి తదనుసమయంబున రుక్మిణీనామంబున మానుషీవేషంబున దీపించు మహాలక్ష్మి లక్షణవతిం బరిగ్రహించి యాభాగ్యవతియందుం బ్రద్యుమ్నకుమారు నుత్పాదించి జాంబవతి వరియించి సత్యభామం బరిణయించి శతధన్వుని సమయించి దీపించుచు మఱియు ననేకభావన్నుండై యుపమాలంకారంబు ననుకరించుచు ద్వితీయప్రతిభటరహితుండై యనన్వయంబు ననుసరించుచు, నేకధర్మాశ్రయుండై యుపమేయో

* ఇంకాశ మాయించి యనిరేః యుండనా. † ప్రస్థానాదితోరీకృతసంగపూర్వ-మూ.

పహూలంకారంబు హసించుచు భేదాభేదవాదనిదానం బై స్మరణాలంకారం బు నిరసించుచుఁ బ్రకృతోపరంజకం బై రూపకాలంకారంబు ననుగ్రహిం చుచుఁ బ్రకృతోపయోగిక్రియార్థాప్రకృతస్వరూపం బై పరిణామంబు నా దరించుచు రసికజనప్రతిభావిలాసగృహీతానుభవం బై భ్రాంత్యలంకారంబు లోఁగొనుచు నిషేధవచనప్రతియోగి యై యపహ్నవాలంకారంబుఁ గా దనుచు బహుజనపరికల్పితబహూల్లేఖం బై యుల్లేఖంబుఁ బైకొనుచుఁ ద్విప్రకారమనోహరం బై యుత్ప్రేక్షాలంకారంబు మార్కొనుచు ననిశ్చి తాంతం బై సందేహాలంకారంబుఁ దోడుకొనుచు మహావాక్యప్రతిపాది తైకత్వం బై నిదర్శనాలంకారంబు విడంబించుచుఁ గవిప్రౌఢోక్తివిషయం బై యతిశయోక్త్యలంకారంబుఁ దిరస్కరించుచు నవజ్ఞా‡తవర్ణ్యం బై ప్రతీపాలంకారంబు నిందించుచు బింబప్రతిబింబభావోపేతం బై దృష్టాంతా లంకారంబుఁ బరీక్షించుచు హితాహితతుల్యవృత్తికం బై తుల్యయోగితా లంకారంబు నాక్షేపించుచుఁ బ్రసిద్ధాధిక్యవిలసితం బై వ్యతిరేకాలంకారంబు వంక లెన్నుచు సమాహితసార్థముక్తినిలయం బై సహోక్త్యలంకారం బు నాక్షేపించుచుఁ దత్ప్రతిభటశబ్దార్థసంసేవితం బై వినోక్త్యలంకారంబు ననుగమించుచు నర్థాంతర†సమాక్షేపాధిష్ఠానం బై సమాసోక్త్యలంకా రంబు నుల్లసం బాపుచు సద్భావరమ్యం బై పరికరంబుఁ గినియుచు నా నార్థనిధానం బై శ్లేషాలంకారంబుఁ జౌకసేయుచుఁ బ్రస్తుతకార్యప్ర త్యాయనసమర్థం బై యప్రస్తుతప్రశంసాలంకారంబుఁ జౌకళించుచుం గార్యానుమేయకారణభావం బై ప్రస్తుతాంకురాలంకారంబు నవఘళించు చు వ్యాప్తిసముల్లసితం బై యనుమానాలంకారంబు బెదరించుచు విశేష భానగమ్యం బై పర్యాయోక్త్యలంకారంబు విదళించుచు *విధినిషేధవచ నములం బై నిషేధాలంకారంబుఁ బ్రతిషేధించుచుఁ బరిహృతవిరోధం బై విరోధాభాసాలంకారంబు విరోధించుచు సకార్యసంబంధం బై విశేషో క్త్యలంకారంబు నవమానించుచు నకారణకార్యవశంగతం బై విభావనా లంకారంబు నిరోధించుచు విలక్షణకార్యోత్పత్తిమంతం బై విషమాలంకా రంబు బహూకరించుచు విచిత్రప్రయత్నసంబంధి యై విచిత్రాలంకారం బుఁ బోనాడుచు సూక్ష్మోదారం బై సూక్ష్మాలంకారంబు మన్నించుచుం

‡తాపర్ణ్యం బై-మూ. †సమాధోపాధిష్ఠాన-మూ.

*విధ్యలంకారవిషయ మిందులోపించినదేమో.

‡గారణమాలాలంబం బై గుంభాలంకారంబు ఘటించుచు గృహీతముక్తం బై యేకావళ్యలంకారంబుం గనరుచు దీపకైకావళీయోగం బై మాలాదీపకంబుఁ గికురించుచు నుత్తరోత్తరగుణోత్కర్షం బై సారంబు వెలయించుచు మఱియు నుపాదానలక్షణలక్షితం బై జహదజహల్లక్షణావ్యాపారద్వయంబు జయించుచు వృద్ధ*నిష్ఠాపదసర్వనామస్థానం బై సంస్కృతశబ్దానుశాసనంబు ననుశాసించుచుఁ జతుస్సాధనాభిగమ్యం బై ప్రమాణదర్శనంబుఁ జుంబించుచు, నిశ్చితవేదార్థం బై వాక్యశాస్త్రంబుఁ గేలిసేయుచు నద్విత్వం బై ప్రాకృతవ్యాకరణంబుఁ గారించుచుఁ బ్రత్యయసులభం బై ఛందంబు నపలపించుచు స్థిరప్రాణ్యుపకృతిపదం బై వికృతివ్యాకరణంబు నపహ్నవించుచుఁ బ్రకృతివికృతిసంశ్రయం బై మహానాటకంబు నదరించుచు నమితం బై గద్యకావ్యంబుఁ గాకుపఱచుచు సువృత్తావృతం బై చంపూప్రబంధంబు ననుబంధించుచుఁ గళాస్వరసహితం బై గాంధర్వవిద్యం గంపించుచు నస్తోకహస్తలక్షణమధురం బై భరతంబు గనికరించుచుఁ దనరూపంబు మిగుల వెలుంగ నసముండేని సముం డై యుదరుం డయ్యు సదరుం డై యరిభరణప్రవీణుం డయ్యు నరిహరణప్రవీణుం డై సవిశేషుం డయ్యు నవిశేషుం డై యమానుం డయ్యు సమానుం డై యగదుం డయ్యు సగదుం డై వనవిహారశీలుం డయ్యు నవనవిహారశీలుం డై సోదయుం డయ్యు ననుదయుం డై శేషి యయ్యు నశేషి యై యహీనసనిద్రాముద్రుం డయ్యు నిద్రావేశరహితుం డై యనర్జునుం డయ్యును నర్జునాధారత మెఱయుచు లోకబాంధవుండు గావునఁ గమలాలయామోదఘటకత్వంబునం దమోహరణపాటవంబునఁ బాటిల్లుచు స్పర్శవిధుండు గావున జగదాహ్లాదకరత నమలినతారావళీమనోహరతం బ్రవర్తిల్లుచు సమవర్తిగావునం బ్రియాప్రియతుల్యయోగదండధరత ధర్మనిర్వాహణధురంధరత నాలంబించుచుఁ గాలుష్యంబు వర్షాసరిత్సరజ్జలకపితాంగనాహృదయంబులయందు పదనియమాభావవర్ణవైపరీత్యంబులు ప్రాకృతవ్యాకరణంబునందు యస్పష్టాలంకారత సురతమృదితముదితాధ్వనికావ్యంబులయందు విరాగతచుంబితకాంతాధరంబులయందు యసుందరత్వంబు మధ్యమకావ్యంబులందు నీరసత్వంబు వజ్రాదిమణిచిత్రకావ్యంబులందు నిరర్థకత్వం బపుష్టపదంబులందు యకళావత్త్వంబు ద్రుతప్రకృతులయందు వక్రత కాంతాఘాలాలక శరవిశే

‡ ఇందుఁ గారణమాలాగుంఫశబ్దములు తాఱుమాఱు అయినవి. *శిష్టా-ప్రూ.

వ. ఇట్లు పెరుఁగుచు నబ్బాల తనశైశవంబున.

సీ. చెలులతోఁ బనివేషములు మేలుతనబొమ్మరిండ్లుగాబొమ్మపెండ్లిండ్లు సేయుఁ
దారకాగ్రహావిధితరుణులతోఁ గూడి యొప్పుగా వెన్నెలకుప్ప లాడుఁ
దసరాడుఁసయ్యాంద్రధనువులపై నెక్కి యింతులతోడ నుయ్యేల లూఁగుఁ
గూర్పుకన్నియలతోఁ గూడి కుంభంబునఁ గొమరొప్ప గుజ్జనగూళ్లు వండు
మొగులుచాటున*దాఁగిలిమూఁతలాడు, సప్తఋషిబాలికలతోడ సరసమాడు
నంచబోదల కెల్ల నాట్యములు గఱపు, బాల నవశైశవారంభవేళలందు.

చ. జలదముమాటునం బొలిచి చాన మెఱుంగయి మిన్నువాఁకయం
‡చలమునవిల్చి యాంచయయి, చంద్రపిఱుందఁ దదీయరేఖయై
మలయును బుష్పాఁదీఁగియలమాటునఁ గల్పకవల్లిలీలయై
లలిఁ గిఁకురించుఁ దోడిచెలుల న్నతి†దాఁగిలిమూఁతలాడుచున్.

క. నీలాభగవల్యంశజ, బాలిక బాలారవిందపంక్తులు దిశలం
జాలం జాల రచించును, లీలన్ శ్రమపడుచుఁ ? దనదు లేఁజూపుగమిన్.

క. దిన మొక్కచాయఁ బెరుఁగుచు, వనజాయతనయన చూడ నన్నెఁ దనర్చెన్
మనసిజుఁ డాడింపఁగ గవిసన దీసిన పసిఁడిబొమ్మచందము మెఱయన్.

చ. మదవతి వాక్యపద్ధతి సముచితరీతి ఘటిల్ల వర్ణముల్
పదులు గణింప నైదు నొకపట్టున నొక్కొకచోట నాలుగే
పదులు వసించు నొక్క యెడఁ బాయును నాల్గు లిపుల్కలొక్కెడం
గదిసి మెలంగెడుం దెలియఁగాఁ బదియు న్మఱి నాల్గువర్ణముల్.

క. వైదర్భిమీఱు నెచ్చెలి, వైదర్భీరీత్యుదీర్ణవైభవరసధా
రోదారకవిత మెట్లు ప్రమోదావహ గాదు రసికపురుషుల కెల్లన్.

క. పదచిత్రతార్థచిత్రత, లాదవినకవితయు విచిత్రమొగిఁ గనుపట్టం
బదగతుల సోపమం బై, యది నిరుపమ మగుచు మెఱసె నబ్రముచూడన్.

సీ. సుప్తిజ్వి శేషసంశోభితత్రివిధశబ్దంబులు దోషసర్వస్వ మెడల
శయ్య నమర్చుచు సత్పాకశుద్ధిగఁ ద్రివిధగుణంబుల రీతు లమర
వృత్తులు చెలువార వివిధరసానుగపదవర్ణసమసనప్రాప్తు లొనర
వ్యంగ్యంబు మువ్వన్నె లమర శబ్దార్థవైచిత్రివిశేషము లెన్నమిగుల
వాగ్బలం బైనకవిత చెప్పంగ నేర్చెఁ, బ్రాంతచనువులప్రోవుగా రాపుఁబట్టి
విమలతస్త్రీతిమాధురివిన్నయపుడు, కవిగురులుకవితగురుతయుఁగాంచఁగలరె.

---

* దొంగుడుమూతలాడు-మూ. ‡ యాంచలదమునిల్చి-మూ † దాగిలిమూచులాడుచున్.

మ. తెఱఁగై బాల్యము వోవ బాల యతిదీప్తిం జూడఁగా నొప్పె నా
తెఱఁగుసొంపుం గటిపెంపు మేనుజిగి యుద్దీప్తస్తనౌన్నత్యము
న్మెఱిపంపున్నడతీరు పాదములయొప్పుం గాను లేమిం గనన్
ఓఱవాయన్ జళిపింప సమ్మదునిచే నొప్పారుఖడ్గం బనన్.

సీ. కుటిలప్రచారము ల్కుంతలంబులఁ జెందెఁ జపలభావము నేత్రసరణిఁ జేరెఁ
బంకనాంగత్య మేర్పడ వాలమున నుండె నతిరాగవిలసనం బధర మంటెఁ
గఠినత్వమెల్ల నొక్కటఁ గుచంబులఁ జెందెఁ బట్టువిషమి నితంబమున నిలిచె
కలుము లెఱుంగముల్ గొనుఁ దీఁగె వసించె జాడ్యంబు పదపులజాడ నమరె
ముదిప మెల్లను సిగ్గులో ముడిఁగికొనియె
*గుట్టెఱుంగమి యలనాభిఁ గూడికొనియె
నెలఁత తన బాల్యచేష్ట లన్నియునుఁ దన్ను
బాయకుండఁగ నొప్పె యౌవనమునందు.

చ. అలరుపసంత మబ్బినపుడా నొకకొన్నిదినంబు లింతె మా
కలుములు సప్పుడు న్సమత్తకై ‡కొఱగా మని పల్లవంబు లా
జలజదళాక్షిపాదజలజాంబులు గైకొని పూజసల్పె స
య్యాలరు లనాఁగఁ బాదనఖరాంకురము ల్గనుపట్టు నింతికిన్.

క. జిగి దప్పి చుక్కఁగమి యా,మగువపదనఖాలితోడ మార్కొనలేమిం
బగ లుడిగి యుంచుటం గద, గగనములో డాఁగి రేయి గనసగుచుండెన్.

గీ. నిలుక జెఱుఁగని చిగురాకుసీట దెంత, తూపడిన పద్మరాగమ్ము రాణయెంత
సొగసుఁగెంపుదామరలసొంపుచూఱకొన్న, వనితపదములతో సాటివచ్చు టెట్లు.

చ. ఎడసినకాండసంపదల కెంతయు స్రుక్కుచు వాడు టంది తా
రుడుగని వేతకోఁతలకు నోర్చుదొన ల్కలమంపుగర్భముల్
జడిమ వహించెఁ గాన సతిజంఘలతో సరిగాఁగ నేర్చునే
జడమతు లైనవారలకుఁ జక్కఁగఁ జిక్కునె సద్విచారముల్.

క. సరసిజలోచనజంఘల, సరిపత్తు మటంచువచ్చి శరములపా లై
యిరుగడలఁ గట్ల పాలై, శరధులు కడు నాగిలెఁ దగనిసాహస మగునే.

క. మృదుపదమై మాధుర్యా,స్పద మై చెలిజంఘ రసము చాలఁ గఁబిలుకన్
మృదుపదమై మాధుర్యా,స్పదమై యలరారు రచనవడుపు దలిర్పన్.

*గు జెఱుంగమి — మూ. ‡ సముత్సైకొత్తగామని — గూ. ౨. సముత్సైనఁగా ?

మ. తెలుపై బాల్యము వోవ బాల యతిదీప్తిం జూడఁగా నొప్పె వా
తెలిసొంపుం గటిపెంపు మేనుజిగి యుద్దీప్తిన్ సెస్పత్యము
స్మరిపంపున్నడతీసు పాదములయొప్పుం గొను లేమిం గనన్
ఓఅవార్యన్ జళిపింప నమ్మరునిచే నొప్పారుఖడ్గం బనన్.

సీ. కుటిలప్రచారము ల్కుంతలంబులఁ జెందెఁ జపలభావము నేత్రసరణిఁ జేరెఁ
బంకనాంగత్యే మేర్పడ ఫాలమున నుండె నతిరాగవిలసనం బధర మందెఁ
గఠినత్వమెల్ల నొక్కటఁ గుచంబులఁజెందెఁ బట్టుపిడమి నితంబమునఁ నిలిచె
కలుము లెఱుంగముల్ గొనుఁదీఁగె వసించె జాడ్యంబు నడపులఁజాడెనముగె
ముఱిప మెల్లను సిగ్గులో ముడిఁగికొనియె
*గుర్తెఱుంగమి యలనాభిఁ గూడికొనియె
నెలఁత తనబాల్యచేష్ట లన్నియునుఁ దన్ను
బాయకుండఁగ నొప్పె యౌవనమునందు.

చ. అలరుమసంత మబ్బినపు డా నొకకొన్నిదినంబు లింతె పూ
కలుములు నప్పుడు న్నమతకై ‡కొలఁగా మని పల్లవంబు లా
జలజదళాక్షిపాదజలజంబులు గైకొని పూజసల్పు న
య్యలరు లనాఁగఁ బాదనఖరాంకురము ల్గనుపట్టు నింతికిన్.

క. జిగి దప్పి చుక్కఁగమి యా, మగువపదనఖాలిఁ దోడ మార్కొనలేమిం
బగ లుడిగి యుండుటం గద, గగనములో డాఁగి రేయి గనసగుట్లన్.

గీ. నిలుక డెఱుఁగని చిగురాకునీటు దెంత, ఆపడిన పద్మరాగమ్ము రాణయెంత
సొగసుఁ గెందామరలసొంపుచూఱకొన్న, వనితపదములతో సాటివచ్చు టెట్లు.

చ. ఎడసినకాండసంపదల కెంతయు స్రుక్కుచు వాడు టంది తా
రుడుగని వేఁతకోఁతలకు నోర్చుదొనలు కాలమంపుగర్భముల్
జడిమ వహించెఁ గాన సతిజంఘలతో సరిగాఁగ నేర్చునే
జడమతు లైనవారలకుఁ జక్కఁగఁ జిక్కునె సద్విచారముల్.

క. సరసిజలోచనజంఘల, సరిపత్తు మటంచువచ్చి శరములపా లై
యిరుగడలఁ గట్ల పాలై, శరధులు కడు నొగిలెఁ దగని సాహస మగునే.

క. మృదుపద్యమై మాధుర్యా, స్పదమై చెలిజంఘ రసము చాలఁగఁ జిలుకన్
మృదుపద్యమై మాధుర్యా, స్పదమై యలరారు రచనవలెపు దలిర్చన్.

*గుఱి తెఱుంగమి — మూ. ‡సముకట్టైకొన్నతానుని — మూ. సముకట్టైకొనఁగా ?

ఉ. ఆరమణీశిరోమణికుచాద్రియుగాంతరసీమఁ బుట్టుశృం
గారరసంపుజా లనఁగఁ గానఁగనయ్యెను ముద్దుఁగుల్కు నూఁ
గా రది నిల్వఁగా నయినయద్భుతనిమ్న మనంగ నొప్పుచె
ల్వారెడు నాభిగహ్వర మయారె మృగీదృశరూపవైఖరిన్.

క. అరయఁగమనముల్ దివియుం,బరమాణువుఁ గలదటంచుఁ బలికించిన వే
హరిమధ్యనడుము సంశయ,పరమాస్పద మౌట నెట్లు పాటిలు నుపమల్.

గీ. చారుతర మైననాభిశృంగారసరసి
రసము వెల్లుబ్బి కుచమహీధ్రములనంటి
పాఱునూఁగారుజాలు పైఁ బయలుపడెడు
కరడు లనమించె మువ్వాళుల్కునలముఖికి.

మ. లలిశృంగారరసప్రవాహ మొనరన్ లావణ్యవర్షాగమా
కలనోద్భూతవళీతరంగములు వీకం దాఁకఁ బెల్లుబ్బను
జ్జ్వలతేజోమయ బుద్బుదద్వయము నా జన్మించె నయ్యంతి మే
ల్వాలిచందోయి నెఱుఁగు లుల్లసిలు భాస్వద్బాహుమూలాంత మై.

చ. అరయఁ ద్రివేణికాజల మనంగుఁడు గ్రుంకఁగ జవ్వనంపు మే
ల్సిరి కడు నించి డింప నోఁగిఁ జెల్వ(గు)పైఁడి పనంట్లు గుబ్బ లౌ
నురవడి డించుచోఁ దోడఁక నొప్పెడు జా లనఁ గాన సయ్యెడు
న్వరహారినీలమౌక్తికసువర్ణనిబద్ధవిభూషణప్రభల్.

క. అప్రకృతభూధరాదుల, కప్రకృతం బయ్యెఁ జెలువయప్రపుగుబ్బల్
అప్రకృతతయును బ్రకృతత,యీప్రకృతపుఁజన్నుదోయి నెనయుఁ గ్రమమునన్.

చ. కలయఁ బ్రసాద మొప్ప నధికస్ఫుట మై మధురత్వ మొందఁ గో
మలపరుషస్వభావపటుబంధము మీఱ సమస్తభూషణా
వలులు దలిర్ప సద్రసవాసితఁ గావ్యమునాఁ జెలంగు నె
చ్చెలిచనుదోయి శ్లిష్టతనుఁ జేకొని మానదు మో విసంధితన్.

క. ఉరుకుచభూధరపతికిం, గరిఘటములు మిత్రమయ్యెఁ గనకకలశముల్
పరికింప సమతఁ గైకొనె, నరులును సఖిభావ మందె నరుదు దలంపన్.

క. అరిగజకటదారణమున, నురుసుమనఃపంక్తిపోషణోదారతచేఁ
బురణించు మొనలు సూపుచుఁ, దరుణీవక్షోజభూమిధరరాజు కడున్.

ఉ. శంక యొకింత లేక చెలిచక్కనిబాహులు సాటి కేఁగఁగాఁ
బంకముఁ జెంది కంటకులపా లయి లో బలులేమిఁ జొదెఁ గాఁ

బంకజనాళి లట్లగుట వాని సాధించు శుచిత్వవృత్తిచేఁ
గొంకక సత్ఫలంబు గొను కూఁకిమిగుల్ఫఖాంసరాజియుల్.

ఉ. వననిధిఁ బుట్టి సన్మణినివాసము నై హరి కేలు వట్టి యా
ధనపతిచుల్లు సొచ్చియు ముదంబున మంగళసూత్రవైభవం
బునఁ దనరారనైతి నని పూనిక శంఖము చామకంఠ మై
ఘనత వహించి కాంచు మణికాంచనమంగళసూత్రసంపదల్.

క. నిటలాక్షుఁడు పూలంబున్న నట హరిపత్రంబుమీఁద నమరుటకతన
న్వటఫలము ఫలము గాంచెను, బటుగతినీయింతిచుబుకభావముగొనుచున్

చ. సరసిరుహాక్షిదంతములసాటికి వత్తు మటన్నఁ గుందము
శ్వైరియునుగా నిరంతరము వేసరి చీఁకటిబందిగంబులం
జొరఁబడి వాడుఁగా మిగులసూత్రముల న్సరిగట్ట స్రుక్కుఁగా
పొరిఁబొరిఁ గందుగా నెఱయ భూరికుచాంతరదుర్గసీమలన్.

గీ. *అక్షయంపుగుణస్ఫూర్తియమరనేని, ఛిద్రములు లేనిగుంభంబుఁ జెందనేని
తరణిసందనముద్దులదంతపంక్తి, యాభిరూప్యంబు గాంచు ముత్యాలబంతి.

ఉ. పంచము లంట మే నిది యపాత్ర మటంచు వనాగమాంతశా
ఖాంచలవృత్తి నై చివు రుపాశ్రితమాధవసంగ నైకర
క్త్యంచిత మై వధూటిమధురాధరతం జని చెందుటం గదా
కాంచెను సద్విజన్మపరికల్పితసంతతసంగసౌఖ్యముల్.

సీ. జలవాసతపమైన(న)జలజంబులకుఁ గళాధరుని రాకకుఁ బ్రమోదంబు లేదు
లలి నట్టితప ముత్పలంబున కగునేని మిత్రవైముఖ్యంబు మిగులుచుండుఁ
గలదు భిక్షావృత్తి గండుఁదుమ్మెదలకుఁ బాయిత్వ మెన్నఁడుఁ బాయకుండు
గగనస్థితవ్రతం బగుచకోరంబున కెన్న దోషాకరునింపు గదురుఁ
గాన చక్కని కాళిందికన్నుఁగవకు, నెన్న నివి సామ్య మేగతి నెనయఁగలవు
ఎట్టికష్టంపుఁదపమైన నిలవిగుణత, గన్న ఫలమిచ్చుననుమాటగలుగుటెట్లు.

గీ. నిచులబంధవరాలోకనిస్ప్రమిళ(?),లమలమాధుర్యరసవైభవాస్పదంబు
లగుచుఁజెలువారుకాళిందిసోగసుఁగన్ను,లన్నలోతమ్మిలోయువియబ్జములకు.

సీ. చానకన్నులతోడిసాటిఁబూనఁదలంచి భ్రమసి బేడిసలు గాలములఁబడియె
జెలువయక్షులతోడిచెలిమి సేయఁగవచ్చి పొందమ్మిమొత్తముల్బురదబడియె

---

* యాక్షయ్యగుణస్ఫూర్తి— మూ.

ముదితచక్షులతోడ మురువు సూపఁగవచ్చి కల్వలు నీళ్ల(లో) మున్గఁబడియె
మానిని నయనయుగ్మంబు జోడన లేటికొంచమకన్నులు భీతి బెదరుపడియె
రమణిరమణీయతరవీక్షణముల తేట, బూనఁబోవుచుమదిరంబులూఁతఁబడియెఁ
బొలఁతి చూపులచెలువమ్ము బెళుకు లోలయఁ
గోరి తేఁటులు బికిరంపుఁగూడు గొనియె.

గీ. చన్పకమునువ్వుఁబువ్వునుసరవిఁగూడి, యింతిఘ్రాణంబునకుసాటి నెనయలేక
వంతనంతంతకునుదలవంపుగాఁగఁ, బండుటలుచూడమే ధరాపుండలమున.

చ. ఎదుట మెలంగువస్తు వొకయించుక కన్పడనీని మైలతో
సదనునఁ బెట్టు తెల్పులకు నబ్బదు నిల్కడ లేదు మార్గవం
బిది కొఱగాదు జన్మ మని యెంచి రతీస్వరదర్పణంబు ల
మ్మదవతిచెక్కులై యెపుడు మానని తేట మృదుత్వముం గొనున్.

క. నవనవరోచిర్నిచయ, శ్రవణము లగుకుందరదన శ్రవణంబులకు
న్నవ తనుచుఁ బల్కఁ దగునా, నవతను సరిగాక మెలఁగునవసంఖ్యనిలన్.

చ. చెలి చెలువంపుఁగర్ణములశ్రీ హరియింపఁగ నేల వచ్చె శ
ష్కులు లకటా వివేక మొనగూడక యయ్యపరాధ ముత్కటం
బిల నొనగూడె వాని కది హేతువుగా జను లెల్ల నిప్పుడున్
సలసలఁ గ్రాఁగుసూనియలఁ జాలఁగఁ జాలఁగ ముంచి యెత్తుటల్.

క. కలకంఠిమృదుకటాక్షాం, చలరమ్యద్యుతులు నిండు శ్రవణద్వయి దొ
ప్పలు నించు*చీరసంబున, విలసిల్లెడుకూపయుగళివిధముం గొనుచున్(?)

చ. జలమరుపద్మనీలజలసంభవకైరవఖంజరీటప
క్ష్యలిహరిణాక్షిమీనహరిణాంకపతత్త్రుల దృష్టిమాత్రనే
తొలఁగఁగఁజేయుఁ గన్ను లని తోయజసూతి నవాఖ్యసంఖ్యల
న్నిలిపెను బార్శ్వయుగ్మమున నేర్పున నా సతిపేను లింపగున్.

ఉ. తియ్యన కాని యొండు మతితీ రొకయింతయుఁ గానరాదు నే
నయ్యలివేణికన్బొమలయందముఁ జెందనటంచుఁ జప్పనై
యొయ్యన బెండు గైకొనుచు నుండు మనోజునిచేతిసింగిణీ
యెయ్యెడఁ బిల్లపిల్లతర మించుకయేనియుఁ జేగఁ జెందెనే.

క. కనఁ గన మిగిలెడుమధురిమ, గనఁ జెలికన్బొమలతీరు గానక మరుచే
నన చెఱకువిల్లు ప్రాణము, గనఁజాలక కాదె నిలువుఁగన్నులుపడియెన్.

*చిరసంబున—మూ

క. పున్నమనాఁటినిశాపతి, కన్నియ[illegible]వించు కుందనపుటీక కదా
సన్న మగుఁ దజ్జయంబును, మిన్న[illegible]ఁబు గాంచు మెఱుఁగులబలిమిన్

ఉ. తమ్ములమేలు పూనమిని దక్కులవెన్నెల మేనుసోఁకిన
న్నెమ్మిపహింపమిం గలుగునింద తొలంగఁగ నిండుఁజందురుం
డెమ్మెలతెమ్మియుం జెలువయింపులనెమ్మొగ మూదుఁ బూనెఁ గా
తమ్ములమేలు మేల్సొగసుఁ దాలుచు లేనగుతేటనెన్నెలన్.

గీ. సవతు గనఁడయె యఁబూర్ణదోషాకరుండు
బహుళమునఁ గ్రిస్తజలములు ప్రీతియు కావు
పరిహృతాశేషదోషమై భవ్యకాంతి
వైభవము గాంచు నెచ్చెలివదనమునకు.

క. ఎన్నఁ బ్రతిబింబభావా, పన్నం బగు ముకురమునకుఁ బోటిలు నేలా
*గన్నన్న సమత బింబత, గొన్న వికర్తనతనూజగొనబుమొగముతోన్.

గీ. కాంతివారాశి యగుభానుకన్యమోము
జిగి నొకించుక యప్పుగాఁ జెంది నొక్క-
రేయి చెలువొంది యది దీర్ఘలేమిఁ బొడము
పాపము కళంకమై విధుఁ బాయకుండు.

గీ బహుళపక్షపాతభావితుఁ డైనట్టి, చందమామ జడుఁడు సాటి యగునె
సమతఁబూని శాస్త్రసర్వస్వవిదురత, వఱలుచుండుచెల్వ వక్త్రమునకు.

చ. పగ లిది రేయి నాక మఱి పక్షవిభేదము గాంచ కెప్పుడుం
దగఁలు మహోదయస్ఫురణఁ దారకనుం నక్కనికూర్మిపట్టి మే
ల్సొగసులనెమ్మొగంబునకుఁ జొప్పడునే సరి యెంచుఁ బల్కఁగాఁ
దొఁగ చెలికాని దోషములు దూఁకొనువానిఁ గళంకభావితున్.

క. కనఁజనియె ముకుర మిందుఁడు, కొనవవ్వంజనియె మాఱుకొన్నంజనియెన్
వనజంబు గాని నెచ్చెలి, గొనబులనెమ్మోము సాటి గొన విజ్ఞగతిన్.

గీ, అమరు బింబానుబింబైక్య మరసిచూడ, నరుదుబింబానుబింబులకైక్యవృత్తి
కంబుకంధరముఖదర్పణంబుతోడ, నైక్యమొనగూడెఁ జందురునకబ్బురంబు.

ఉ. సాటికి రానినీలములు సానల రాపడెఁ బాఱుఁబోతులై
తేఁటులు పోయె మేఘములు ధీనత మొల్లలు (వెట్టెఁ) జామరల్
గాటపుఁదెల్లఁబా టొదవెఁ గన్పడెఁ బల్వగఁ గేకిపింఛముల్
పాటలగంధికొప్పుసిరిప్రాభవ మెన్నఁ దరంబె చూడఁగన్.

---

*గళగన్న సమతబింబత—మూ.

గీ. అఖిలసుమనఃకదంబకాభ్యంతరోదిత (సూపర్) నిరజాస్తతనూభవనీలకబరి
దాసిసవతించునేగతిఁబూనవచ్చు, జగముకైనీరములు, మోయుజలవహంబు.

క. అమరెడుకీల్జడ స్రగ్ధర, కొమరుమిగులు పిఱుఁదు దలఁప గొనబగువిపులే
కమనీయతనువు చపలే, రమణీమణి యాకార వృత్తరత్నాకరమే.

క. చెలమా సుధ కధరము చం, చలమా కనుదోయి కుచము చాలితకనకా
చలమా నైపుల్యజితా, చలమా జఘనంబు ఘనము చానకు నెన్నన్.

క. రాకాచంద్రుని నగు నా, రా*కాంత మొగమ్ము కెంపు రావికి నే
రా కామినియధరము చిగు, రాకా పాదంబు సుకుచిరాకారమునన్.

క. †నాకము నగుఁ గొనమ్మో. నాకము(జిగి)గుబ్బ యలపినాకము బొమ యా
లోకముల సుదతి హారిణా, లోకము నిందించు నౌర లోకము మెచ్చన్.

క. ధరమా కుచ మూబలుఫణ, ధరమా నూఁగారు ‡నీరదాయకధారా
ధరమా కచంబు స్వర్ణవి, ధరయాధరమా మెఱుంగు ధరణిజఘనకున్.

సీ. ఇంపారుకీల్జడ యిందనీలముఁజేయ మధురంపు మోము పద్మంబుఁజేయు
ముత్యాలసరిఁ జేయు ముద్దురదశ్రేణి రుచిరంపుమోవి విద్రుమముఁజేయు
శంఖంబుఁజేయును జక్కనికంధర గుబ్బలు బంగారుకొండఁ జేయు
భూమిచక్రముఁజేయుఁ బొందైన జఘనంబు తలరుమధ్యమ్మసంతంబుఁజేయుఁ
గలికిపాదంబు పద్మరాగంబుఁ జేయుఁ జాననిలువెల్లఁ దప్తకాంచనముఁజేయు
వెలఁదిఁగొనియాడుమాటలు పేయునేల, రమణిలావణ్యమొగిసముద్రింబుఁజేయు

సీ. జలధరమాలిక జగజంపుకీల్జడ చంపకమాలిక సరసనాస
భ్రమరవిలసితంబు కొమరారుకనుదోయి మత్తకోకిల యగుమంజుగళము
శిఖరిణి యైమించుఁ జెలువౌ రదశ్రేణి స్రగ్ధరయగుఁ గుబ్బచన్నుదోయి
యనుపవిద్యున్మాల యగును దనూయష్టి మత్తేభగతియగు మంజుపదము
అలభుజంగప్రయాతమె యూరు దనరు, బంధురంబయ్యె సర్వాంగభవ్యలక్ష్మి
యరసిచూడఁగఁబంకేరుహాక్షపూతి: విశదలావణ్యమహిమసద్వృత్తమయ్యె

సీ. రమణిలావణ్యాంబురాశిలోఁ గనుపట్టుఁ దేఁటులగుంపులు దెలివిమోఁబు
మువ్వన్నెచందుమల్ ముద్దులమోనము ల్పసిఁడిరము ల్పింపెంగ సొంపునింపు
ముక్తాఫలశ్రేణి మురువంపుఁబవడంబు శంఖంబు గుబ్బలు ల్సరసనాళి
లంపుఁజిగురులు పొందైనజలనీలి బలువైనహారము నిబ్బరవుదీవు

† శాద్యమొగము—మూ. † నాకమనగా శా—మూ.
‡ నీలధారాధరము—మూ.

లబ్బురపుపరపులీనెడునట్టిరంభ, లరిదిగావించు కూర్మంబు లధికమృదుల
పంకజాతంబు లసమానభాసమాన, కాంచనచ్ఛాయ నెప్పు*డొదవించుతీవ.

వ. ఇట్లు నిండుకొల్వునంబున దేవాసురమనుష్యలోక కాంతాదురాపకామనీయక లక్ష్మీలీలాయతనంబున సర్వలక్షణైకలక్ష్యంబు నగునమ్మోహనాంగినఖిలవిద్యావిజ్ఞానవిమలాంతఃకరణ యని విశేషించి సకలజనపరమాహ్లాదైక కారణం బగుసంగీతశాస్త్రంబున మిగులఁ బ్రవీణ యగుట యారసి యారసికనీలవేణిముఖ సఖీజనంబులు తద్విద్యాపాటవంబుఁ దలిదండ్రులగు ఛాయాసూర్యులకు డెందంబుల కమందానందంబుగాఁ దెలుపం దలంచి యొక్కనాఁడు.

సీ. మేటిమిన్నేటిపొన్నీట మజ్జనమార్చి చిన్ని వెన్నెలవన్నెచీరఁ గట్టి
పొంగుసిబ్బెపుఁజన్నుఁ బొంగరంబులమీఁదసొగసుగ్రొంబట్టుకంచుకము దొడిగి
నెఱికప్పుసిరి నొప్పు నెఱికొప్పు చెలువంద నందంపుఁబూదండ లమరఁజుట్టి
రిక్కరాకొముక్కు పెన్నిక్కు చక్కఁగఁజేసి చొక్కునెన్నుదుటఁ జేర్పుక్కఁ బెట్టి
కలువగమి కెగ్గుగలిగించుకన్నుఁగవకుఁ, గలికి కజ్జల†నిగ్గుమిన్కులకాటుకయిడి
యలరు నాణెముత్తైపుసరుల నురతి నిలిపి, తీర్చి రీరీతి నెలఁదికిఁ గూర్చు చెలులు.

క. కాయమ్మున నాభరణని‡కాయమ్ము సఖీజనంబు ఘటియించు చనున్
మాయమ్మ సాటియగు. న్నాయమ్మకు మిగులు నవతు మాయమ్మనుచున్

వ. తదనంతరంబ.

క. విచ్చేయుము నీవిద్యకు, వచ్చెనువడి నేఁడు సత్సభాన్వితుఁ డగుచు
న్వచ్చని కేలుపు విలిచెను, ముచ్చటగా నీదుపాట మురిపముచూడన్.

వ అని విన్నవించిన.

ఉ. వచ్చె సఖీప్రియత్నమున వారిజలోచన వెన్క ముందటన్
హెచ్చు కచాదిభారమున నెమ్మెలుకో నొగిఁగుల్కఁ గొప్పడా
లోచ్చపు లేనిచీఁకటులు సుప్పతిల వ్రాఁడి జెల్క వెంనుసం
దచ్చపుమొల్కనవ్వు జిగి నంచపువెన్నెలచాయ లొల్కఁగన్.

ఉ. కాంచెను గాంచనాంగి దమఁగాంచినదక్షు సమస్తవిష్టపో
దంచితచక్షు ...

* డొదవించితీవె — మూ. † కజ్జనిగ్గు — మూ.
‡ కాయంబున నాభరణము సంఘటియించెన్ — మూ.

సంచితవీక్షుఁ బ్రాగ్భవనసారతనూపచితద్విరీక్షు నా
కుంచితసద్వపుస్త్రితయగోపనపక్షు హతాసపక్షువిన్.

చ. తని కరి మొప్ప మ్రొక్కినను గన్నియ నాదరణాను *వృత్తితోఁ
గనుఁగొని తన్మనోజ్ఞముఖకంజము రంజిల సత్కరంబుల
న్ననుఁగు కవుంగిలించుకొని యింపుగ మూర్కొని తచ్ఛిరోజము
ల్పనుపడదున్న్య చిట్లను నపారకృపారసవార్ధిఁ దేలుచున్.

సీ. పవడంపుఁదీవె రా బంగారుబొమ్మరా పొదలెడురాయంచబోద రావె
గుణరత్నరాశి రా గోనబుఁబూబంతి రా కోమరొప్పుముద్దులగుమ్మ రావె
యతివమేల్బంతిరా ముందాలకుప్ప రా యొఱపైనక్రొక్కారుమెఱుప రావె
యప్పచ్చికొండ రా యతనువాలమ్మ రా సొగసైన చందురుసోగ రావె
ప్రాఁతి యైనట్టి నాతపఃఫలమ రావె, లలిత మైనట్టినవకల్పలతిక రావె
రాణగాంచిననాయింటిలక్ష్మి రావె, తలఁపులోనగూర్చు ననుఁగన్నతల్లి రావె.

ఉ. బంగరు లీనుచూపు గలబంగరుబోటికి సాటియైన మా
బంగరుకొండ వచ్చెఁ గులపావనసద్గుణవార్ధి వచ్చె నా
కొంగుపసిండి వచ్చె మదిఁ గోరినభాగ్యము వచ్చె వచ్చె మా
ముంగిటికామధేను వని ముచ్చట దీరఁగఁ బల్కె వెండియున్.

క. తల్లివి గద కన్యామ. త్తల్లివిగద సొగసుఁగులుకుఁదనముల సిరి నే
త్తల్లివి గద సుభూరుహా, వల్లివి గద మమ్ముఁబ్రోవ నల్లినిభాంగీ.

క. ఒప్పులకుప్పా నినుఁగ. న్నప్పటినుండియుఁ బ్రిమీఁద మనుజలరాశిం
దప్పక మునుంగు నాకుం, జొప్పడె నభ్యుదయమెన్నఁ జోద్యము జగతిన్.

గీ. అమ్మ నినునంటిపట్టి మీకబ్బెఁ గాన, చాయచాయకు మర్యాద

— (ఇక్కడఁ గొంత గ్రంథము లేదు) —

దములబ్బాలఁ దనర
గేయవాక్కర్త్రి యను పేరు గెలుకొనఁగ, వీణ వాయించె నవ్వేళ నేణనయన.

గీ. †తత్పదముభాతి మంగళార్థంబు గీతి, కది పరాత్మవచించుట నంచు నెన్ను
శాస్త్ర మాగీత మగ్గీతశాస్త్రవేత్త్రి, కబ్రిమేభావిసన్మం (గళార్థ) మగుట.

క, రూపవతిగీతిభూషణ, దీపితమై మెచ్చుగాంచుఁ దీవ్రిం బువమా
క్షేపములు వడయునని సభ, నాపాదించుచును మోదమందిరి విబుధుల్.

---

*ద్యుతితో—మూ.	†తత్పంబాతి—మూ.

ఉ. ఛాయలు వేయు గల్గు నజుసామికిఁ జాయలు వేయి గిక్కురా
ఛాయలఛాయ జెం        సాతపతిన్ ఘటిల్లె మే
ల్చాయలకెన్న మిక్కుటపుఁజాయఁ బ్రినర్తిలె ముద్దుఁగాఁడి యా
ఛాయకుమారిగీతి (గసె) సంగతిశీతలనూనుకరీశుప్రీతిన్.

వ. అయ్యవసరంబున విశ్వంభరానిర్భరభారాయమాణ దుర్మానకంపాదిన్పశేం
సను (ష్టసర్పిగాసడ) మణి యగు(శ్రీ)కృష్ణదేవకపటయాదవశిరోమణి ముఖ
చంద్రబింబరుక్చంద్రి కాడంబరంబున నిజనయనజీవంజీవంబులకు సంజీవనం
బసేక్షించి పిరించిపథావధి యగుద్వారవతీపథంబు నాత్మశరణపూతచరణ
(సరోరుహ) విన్యాసంబున ధన్యమూర్ధన్యంబు గాఁ గటాక్షించి తత్కటా
క్షసమాక్షిప్తగౌరవ పరభాగసందానిత మహాభాగవతద్విగుణితహరినామా
నుసంధానబంధురరోమహర్షాశుప్రికంచుక సముదంచితసర్వాంగనయాను
సందామృతధారాప్రవాహంబున నపగతమోహాదిదోషపంకాంతరిత
తాలఘూకృతంబు నఖపరిమాణంబు నతశకరణంబు దేలియాడ మగిడి
సత్యలోకంబు స్వాలోకవిషయంబు చేయం దలంచిన (జగ) డంపుకూటిజడ
దారి గ్రహరాజగృహరాజంబు సమీపంబున సమీచీనతాసధీ్ర చీనతదనూ
నవీణాగానామృతంబు కర్ణకూపంబులనిండారనబ్బురపడిచేపడిన వీణియ వదలి
కదలక మైమఱచి పంచితిహ (?)ంబునందె(న)నిమందపడి (?) డెందంబు
నసంబు గాక మసల మెల్లమెల్లనందేచ్చ కూర్చుండి శిరంబుఁ గంపంబుతోఁ
గూర్చి తర్జని నాసికం జేర్చి తనలో నిట్లని వితర్కించె.

ఉ. ఎక్కడిలోక మేఁ గనని దెక్కడిగానము (నాకుఁ గోత్రిగాఁ
దక్కిన) దిట్టిగాన మొక తావున నైన వినంగ మృగ్య మ
మ్మక్క యిదెంతచోద్య మహహా ననుఁ జొక్కఁగఁ జేసె నద్దిరా
యక్కమలాక్షుకీర్తనమునందును డెందము డింద కుండెడిన్.

క. ఔరా మును వింటిఁ బయః, పారావారజకు సాటి (పద్మాక్షి కుమా)
రీరత్న మయ్యె సూర్యున. కారూఢిగుణాఢ్య * నీలయతులాంశం బై.

క. అక్కన్య సకలవిద్యల, దిక్కులఁ దనసాటిలేక దీపించును బెం
పెక్కు మిగుల గీతములన్, లెక్కింపఁగరాదు మాధురీగుణ మనుచున్.

క. జాతిరుణి యిప్పుడు తండ్రికిఁ, జేతం (బిగురొత్తసేవసే) యఁగఁ బోలుం
బ్రీతిగ నెచ్చెలిఁ గనుఁగొన, కీతఱిఁ జన నాకు డెంద మెనయ దటంచున్.

* నీల గుణ్యాం—ము.

వ. ఇట్లూహించి.

సీ. సంగతతత్పురుషవదనిష్ఠానూర్తి నలరారుపాణినీయం బనంగ
సిద్ధసాధ్యవిశేషబుద్ధస్వరూపతేఁ బ్రాకృతవ్యాకృత (ప్రక్రియనఁగ)
జ్ఞాతాత్మరీతి నిర్ధూతాంజనాత్మత సాధ్యాలంకృతివిశేషం బనంగ
సరళస్థికళాపరిశస్తిపద్యానత సరసాంధ్రశబ్దశాసన మనంగ
నరుగుదెంచెను నారాయణాభిధాయ, కాష్టవర్ణమనూర్తంసకాభిధాన
చతు స్వరస్వరవిశేష, హారిమహాతికరుండు శుభాకరుండు.

సీ. చంద్రోపరి సితాభజలవాహరేఖనాఁ దగుఫాలగోపిచందనము దనర
నైరావతాలింగితాభ్రపగాబ్జలతాలినాఁ బసిఁడిజంద్యములు మెఱయ
నగ్రికాశ్మీరకింజల్క సముదయం బన జటాసమితి వెలుఁగఁ
గలధౌతనగమధ్యగతనీలవేదిక నాఁ గటిఁ గృష్ణాజినము దనర్పఁ
గల్పకస్కంధపరిణద్ధఘనలతమాల, వల్లి యన వీణ భుజమున వన్నెమీఱ
నలువిశలమేను తెఱపి వెన్నెలలుగాయ, వచ్చెనారదుఁడవ్విభావసునికడకు.

ఉ. ద్వారమునుండి రా మునికిఁ దూర్ణము బంగరుగద్దె డిగ్గి బ
ల్గౌరవ మొప్పఁగా నెదురుగాఁ జని భక్తిభయాద్భుతంబు ల
వ్వారిగ సందడించుమది వారిజబంధుఁడు సాఁగి మ్రొక్కెఁ ద
చ్చారుపదాంబుజాతములు సాధుకరద్యుతు లంటి రాజిలన్.

క మ్రొక్కినఁ *జెయ్యులసాకిరి, మక్కునఁ గైగుచ్చి యెత్తిమది ముదమలరన్
అక్కలహాశనమునినగు, మొక్కలుచొక్కటముగాఁగ మొగమునసమరన్.

క. దీవించె నీకు దుర్లభ, మేవస్తువు లేదు దీవ నిడకుండఁగరా
దేవస్తు వక్షయం బగు, నావస్తువు నీకుఁ జుట్ట మిగు నిజ మనుచున్.

వ. ఇట్లు భావిసుంభంబుఁ దెలుపు పలుకు వలుకు తొలిపలుకులగమికానిగాదిలి కొడకుం గడగనని వేడుక గడలుకొన ముందట నిడుకొని వచ్చి యచ్చె రువులకు నెలవగు తన నెలవునకుం దెచ్చి దచ్చిదిక్కులచ్చంపుఁ బచ్చి వెన్నెలలు సొగసు ముసుంగు లొసంగు మగఱామానికంబుల పెద్దగద్దియ నుంచి యుపవంచితభయభక్తి వినయాతిశయ మ్మగునాశయమ్మున నమ్మహాశ యునకు నిర్విశయమ్ముగా నిజశరకు శేశయమ్మున సదాశయోచితంబు లగు నుపచారంబులు చేసి యాబేసిగుఱ్ఱంబుల తేరినెఱదొర దొర నెఱుంగని

* చెవులసామికి-మూ.

గొబ్బున నలకుప్పం దనకూఁతుం బిలిచి యప్పు యిప్పావరహితునకు మ్రొక్కిం
జక్కంబడని దొక్కటియుఁ జిక్కదు మ్రొక్కవలయు నని మ్రొక్కించిన
సత్కారుణికపురుషమణి పురుషశిరోమణిపాణిగృహీతవి గమ్ము సౌమ్యా
యని దీవించి యనుపం బిదపఁ దదనుమతి నమ్మహామతి నిజానుగతసభా
జనంబుల యథాపూర్వోచితస్థానంబుల వసియింప నియమించి తాను
దత్సమీపతలంబున దివ్యభవ్యనవ్యహేమముక్తాఫలాయుక్త నిర్మిదభద్రాస
నంబునఁ గూర్చుండి యుండెఁ దత్కాలంబున.

చ. *త్రోలుపటిపల్కుబల్గనులు సుష్టతమోహరణప్రవీణమౌం
సలమహిమాన్వితు ల్మహితసత్పథవృత్తినిగూఢభావు లా
కలితదిగంకరాశిరుచిగాఢతనూపచిరుల్ సభాస్థలిం
జెలువలరారి రిద్దఱును జీతనజాతము లబ్బురంపడన్.

క. అన్యోన్యకాంతివైభవ, మన్యోన్యముఁ గప్పఁ జిహ్న లవిషయములుగా
నన్యోనియం దన్యభ్రమ, మన్యాయత్తంబుగాక యలవడె సభకున్.

క. నిండు నెలఁబోలు మునిమా, ర్తాండుని మార్తాండుఁ జూచి హర్షైదువుపే
రుండెడుపులుఁగులు భ్రమచే, నొండొండ ముదంబు ఖేద మొందును మిగులన్

గీ. అట్టియెడఁ దమ్మివిడిమట్టుపట్టుదిట్ట, పట్టి యగుపకాని కనియె నవ్వెట్లజెజె
గీటుకొనుహాసమున మోముసీటుగుల్క, మాటమాటకు నమృతంబు తేటలొలుక.

క. నీరాక రాక సమ్మద, నీరాకరమునకు సుగుణనీరాకర యీ
నీరాక గాక యాప్త, న్నీరాకరమునకుఁ దేప నే నెఱుఁగుదు నే.

వ. ఓసుదర్శనకరశుభకరపదభక్తి మత్సుదర్శన నిదర్శనసమధిగత నిఖిలదర్శన
కాలత్రితయపవిత్రతాన్యంగ్యవ్యంజకంబగుభవదీయదర్శనసమంజససంజీవ
నౌషధంబున మదీయతాపత్రయంబపత్రపానిలయంబయ్యెడు మజ్జనసంబు
పరార్థభావంబు నొందెడు మత్తేజంబు వేలొల్లంఘనంబునసలరారెడు మద
భ్యుదయం బనస్తమయంబై చెలువారెడు మదీయనివాసంబు విష్ణుపదంబు
నం జెన్నుగాంచెడు మదధికారంబు గ్రహాతీతం బైయొప్పారెడు మత్కళత్రం
బు కాంతిపర్యాయంబై వెలుంగొందెడు మత్సంతానంబు సమున్నతిఁ గాంచి
యు సమందత దైవారెడు నీ రేడుజగంబులఁ దేజోవంతులకు దృష్టాంతంబై
మెలంగెను. భాగ్యంబు నాకుఁ బొసంగెడు సమాధిమత్కళానిధి [illegible]

*త్రోలుతటిబల్కుబల్కు-సుచు-మూ.

కకృపాపయోధి వగునీదుసన్నిధికి గమనంబు గమకం బగు మత్పురాతనా గణ్యపుణ్యపరిపాకంబ యని యని యరసి నిర్ణయించుకొనియెద నధిగతపరమార్థతకు నవాప్తసర్వకామతకున్ గేవలపదం బైన భవాదృశులకు మాదృశరాజసజనంబు ననుసరించి యకించిదర్థప్రదానంబునకు సంప్రదానత గానుట గగనకుసుమంబు గనుటయె సిద్ధం బని సిద్ధాంతీకరించెదం గా దేని దేవరచిత్తంబు కుతుకలీలాయత్తం బై యదర్థంబు విషయీకరించి సర్వార్థమూర్ధాభిషిక్తంబు సేయ నవధరించె దదర్థంబు భవత్సన్నిధాన వైభవసమాసాదితసంపత్సాకల్యతం దగుభవజ్జనసవిధంబున నస్థిత్వాభ్యాతంబు సంయోగంబు గొని కారకత్వం బంగీకరించు నని నిస్సంశయంబుగా సంకల్పించెద భవాదృశున్సమ్యక్పారతంత్ర్యంబునం బ్రవర్తిల్లు నదోవందారునకు నెందేని స్వాతంత్ర్యం బత్యంతం బవుట చిత్తగించి వాచావిషయత తత్ప్రకాశకక్రియం బ్రసరింపం జేయ దయసేయవలయు నని పునఃపునారచిత ప్రణామంబులం బ్రార్థించిన.

గీ. ఇట్లు *వేపాదములసామియింపునింపు, మధుర భాషలభాషింపఁబూనివిను మ
హారికథాసుధయానినయపుడుగాంచు, మోద మందుచు నత్తమోభేదికసియె,

ఉ. ఓయిసమస్తలోకనిచయోదయహేతునిజప్రకాశ భ
వ్యాయతకీర్తి నీకు నిటు లాడఁగఁ జెల్లునె యన్యులట్లు నీ
వాయతనంబ వైతివి చరాచరసంజననావనక్రియా
పాయనిదానమూర్తులకు భద్రకరాగమరూపవైభవా.

క. మిన్నే దేవత యనుచు, న్నిన్ను నుతింపం బనేమి నిగమావళులం
గన్నట్టి త్రిపదయే నిను, సన్నుతి గావించుకొనుచు సార్థక మయ్యెన్.

క. వెన్నునిఁ గన్నులఁ జూచుట, నిన్నుఁగనుంగొనుట మాకు నిజ మొక్కటి గాఁ
యన్నలినాక్షుఁ గనుంగొని, నిన్నుం గనవచ్చినాఁడ నీరజమిత్రా.

క. ఇంకొక్కటిఁ జెప్పెద నే, వంక న్వినవలదు గాన వైఖరిచే నీ
పొంకపుఁగూఁతురు వను నీ, వంకకు రప్పించెఁ జుమ్ము వనజాతసఖా.

క. నీలాలక యిది నీలా, లీలావతియంశ నవతరించిన దగుటన్
నీలాంతికా ల్లోకేశుఁడు, †లీలాయదుమౌళి ముద్దు లేమం జేర్చెన్.

క. ఈరీతిఁ బల్కు వీణా, పారీణయ తీండ్రవచనబంధమధురిమా
సారములు చెవులు సోఁకిన, బారాకారములసామి పలికెం బ్రీతిన్.

---

*వేయుపాయనులసామి-మూ. †లీలాయదుమౌళి-మూ.

గీ. ఈప్రపంచంబునకుఁ దొల్త నెసఁగుచుండు
సచ్చిదానందమయు మాత్మ (సంగ)రహిత
మనసుగలరూప మవ్యవహార్య మఖిల
మాయసంచారశూన్యంబు భానుమంత.

గీ. అప్పరంబు సిసృక్షచే నమరిత్రిగుణ, మాయఁ గైకొని సగుణత మరగి సర్వ
కారణవిచిత్రకార్యసంభూతరూప, మగుచు నారాయణాఖ్యత నలరుచుండు

సీ. తత్స్వరూపావాప్తి దనరు జ్ఞానంబున జ్ఞానంబుభక్తిచే సంభవించు
వేదాంతవిద్యచే వెలయును సద్భక్తి యవ్విద్య గురుసేవ నందనలయు
సద్గురుసేవ నిష్ఠామత్త్వమున నబ్బునది చిత్తశుద్ధిచే నమును నద్ది
కాలుష్య మణఁగినఁ గలుగుఁ దదాత్మీయత్వ మలనమఁ బాపక్షయంబు గాఁగ
నట్టిపాపక్షయంబుమే లానవచ్చు, దాన యోగాదిసత్క్రియ లూనఁ గలుగు
నవియుఁ దన్నాశ్వరశక్తి దప్పులుటరిది, కర్తనిష్ఠామమానసుఁ గాంచకున్న

క. భక్తియె స్వతంత్రకరణము. ముక్తికి నని కొంద ఱందు భూరివివేకుల్
*భక్తిసుసాధ్యజ్ఞానమె, ముక్తిద మని కొంద ఱందు భూరివివేకుల్.

గీ అఖిల మాత్మేష్టదేవత యనెడుబుద్ధి,నిరతశయభక్తి బ్రహ్మమై పరఁగు నంత
యనుమనీషయ జ్ఞానంబునగునుగాన, జ్ఞానభక్తుల కైక్యనిశ్చయము మాకు.

గీ. కమలబాంధవజ్ఞానయోగమ్ము భక్తి, యోగమన రెండుబలు నానలొప్పుచుండు
ఘోరసంసార వారిధిపారమంద, ననుచుమునికృత్సులోకకొన్నియమరఁబలుకు.

గీ అరయ శ్రవణాదిక్రమాయత్తమవును, జ్ఞానయోగమ్ము తదితరజ్ఞానవిభవ
ఘటకమవుచుండు భక్తియోగం బనంగ, భావమీగతిఁ బలుకు నిబంధనలకు.

వ. విను మప్పరమేశ్వరుం డగునారాయణుండు లోకరక్షణపరాయణత్వంబు
నం దత్తత్కాలంబుల నానారూపంబులు దాల్చుచుండు నందువిశేషించి.

సీ. ప్రాఁబల్కుగమిఁ దమ్మిపట్టికిఁ గూర్పంగ జగమంత పృష్ఠదేశమునఁ బూన
ధరణిఁ గొమ్మునఁ దాల్చ దనుజుఁ గొమ్మునఁ గుల్చ బలి నణోభువనంపుఁబట్ట సేర్పఁ
గృతవీర్యజాదిభూపతుల విదారింప వనధిమధ్యం బరావణము సేయ
ముష్టికాదులఁ ద్రుంపఁబురస త్త్వముహరింపయనసంహార నైథనము గాఁగ
జలచరాకృతిఁ గమఠతఁ జటులకిటిత,నరమృగేంద్రతఁ గుబ్జతఁ బరశుధరత
రాఘవతహాలితఁబుద్ధతలలితహయత, సకలజనములుగొనియాడనతఁడుగొనియె

*భక్తిసాధ్యజ్ఞానమె—మూ.

గీ. తపసి యిత్తఱి నప్పరతత్త్వ మవని, భారకారులఁ గంసాదిఘోరదనుజ
నికరములఁ ద్రుంపవసుదేవునికి జనించి, వఱలుచును గృష్ణుఁడన ద్వారవతి మెలంగు.

వ. అతనిమాయాబలపరిగృహీతదివ్యమంగళవిగ్రహంబునకు నుపమానంబు దు
ర్గ్రహం బన నసంశయం బేమియు నినం గీర్తనధ్యానాదిసాధనంబులం బా
పక్షయార్థు లగుమాదృశు లగుదాసులకుం దదుపమానకల్పనసాహసంబు
న నెప్పదోషంబుఁ గాదని విచారించి నాయథాశక్తి నమ్మహాపురుషు నంగ
సౌందర్యం బీషత్కాలంబు గీర్తించి కృతార్థత గాంచెద సావధానుండవై
యవధరింపుము.

సీ. ఇంద్రనీలచ్ఛాయ నినయు దేహమువాఁడు ముద్దుగుల్కెడునవ్వుమోమువాఁడు
ఘనశంఖనిభ మైనకంఠంబు గలవాఁడు చక్కని వెడఁదవక్షంబువాఁడు
జయలక్ష్మి లీలనాజానుబాహులవాఁడు దనరారు సింహమధ్యంబువాఁడు
జవసంపదల మించుజంఘలు గలవాఁడు తమ్ముల మించుపాదములవాఁడు
కటిని జెన్నొందు బంగారుపటమువాఁడు, ధాతఁ గన్నట్టినాభిపద్మమ్మువాఁడు
వళులు శ్రీవత్సకౌస్తుభప్రభలవాఁడు, చక్కఁదనముల *కిల్లడై జరుగువాఁడు

ఉ. క్రిందయి రేక మోచి పరికిన్నతఁ గృష్ణుని పాదయుగ్మ మిం
పొంద భజించి యంబుజము లొక్కెడఁ దత్సమమాంశలేశ కాం
క్షిం †దనరారఁ బద్మములపై రది నోసిడి తత్సమంబుగాఁ
గొందుకు పాదపద్మ మని కుంఠితబుద్ధులు గారె లోకముల్.

ఉ. అంగుళులే దళంబులు నఖాళులు కేసరము ల్పదప్రభా
కాంగణను ప్రదేశము టొంచితనీలమణీరుచు ల్పల
ద్భృంగములై చెలంగఁ గడుఁ దేజలు శౌరిపదాబ్జముల్ శుభా
ళిం గరుణించి భక్తులకు లేములు వాపుఁ దమోనివారకా.

ఉ. అంగజునేర్పు సంగయుగ మాకృతి కేమ సమానవైభవం
బుం గయికొంటి మింక సగిపోలము కాంతి నటంచు నగ్గలం
‡బృంగి తపించి తిత్తనువు వీడిన నాదొన లేడుగా వన
స్సంగతి నయ్యదూద్వహునిజంఘలసాఁవుఁ దలంప శక్యమే.

చ. తన కుపమానవస్తు వికఁ ధారుణి లేదని కాదె గెల్పుపిం
ఛున ధరియించు మేల్పిరుదు §పో యిదినాఁగ మణీవినూత్నకాం
చనమయనూపురార్భటి నెసంగెడుఁ దద్ఘనజంఘ లెంచ న
వ్వనజభవుండుఁ జాలఁడు దివాకరతత్ప్రభ నెన్న శక్యమే.

---

*ఇల్లుదై.మూ. †దనరారిపద్మములు-మూ. ‡బ్రుంగి—అనియుండుట న్యాయ్యమైనను గొన్ని ప్రాచీన ప్రయోగము లిట్లు గనఁబడుచున్నవి. బ్రుంగి...బోవిడ- అనుట వరక్ష వద్ధతి § మేల్పిరదపోయెగ-మూ.

చ. ఉడుగణడాలు మీఱు హరియూరులతీరిక మేటిసాటికిం
గడఁగి సమంబుగా కనఁటికంబములుం బొరవిచ్చి పోయెఁ బ
ల్విడిసెడి దానఁ జేసి "కదలీ న కదాచన" యన్నిషేధ మె
క్కుడు వడినిల్చెఁ గాదె తమకున్ జగతీస్థలియందు భాస్కరా.
గీ విద్యుదావృత మాధురసమృత్తిశోభి, దీర్ఘఘంటానురణనసందీప్తిరత్న
పదలసద్గుణలలితశోభామిళితము, పద్మదళనేత్రి నుత్కటిబంధ మమరు.
క. ఘన మగునేని జడంబగుఁ, దనియూశ్రియు మట్లుగాన స్థైర్యము గొనరా
దని మెఱుఁగుఁదీఁగ హరికటి, ఘన మజడంబనుచుఁ జేఁకకై పుష నిల్చెన్.
ఉ. దండిసజాండభాండములతండము లుండఁగఁ దత్ప్రచండస
న్మండలియందునుండి గరిమ స్వేడల న్మగుడం జనంగ బల్
గండి యొనర్చిరో యి దనఁగాఁ దనరెన్ హరిదివ్యనాభి *యు
ద్దండత నల్వఁ గన్నవిరి తద్దయు నొప్పు (ను నుండ) భాస్కరా.
చ. తనదు విచిత్రశక్తికి నిదర్శన మై తనరారఁగా బ్రిన
ర్తని మృగరాజభద్రగజరాజులఁ గౌనున యానరీతియం
దు నలవరించి మించె ననఁ దోఁచును దద్విభుమధ్యయానము
ల్గనుఁగొని యెన్న నచ్చెరు వగున్ హరిసుందరభావ మిద్ధరన్.
చ. కవిబుధచంద్రలోకహితకారకమంగళజీవకేతువై
భవశరిపూత్కరంబు గెడపం గడుఁ గూడిన కాలసర్పయో
గవిధిఁ బ్రకాశమందెను నఖండ †లసద్భుజదండకాండమై
భవముల నొప్పు మాధవుఁ బ్రస్తుతిసేయఁ దరంబె భాస్కరా.
చ. అమర ధరాంబరద్వయమునం దెసలాను గుణంబునందు ది
వ్యములు(?)సురారివైరిరశనాకృతి దాలిచెఁ గాక(దా) ననం
తమణిసితాసితార్క్యగురుధామ వినూత్నచంద్రసౌమ్యభా
వముఁ గనఁజాలునే రశనభావము లోనఁ దలంప భాస్కరా.
ఉ. కలికితినాన నోట మిటు గన్పడె నాపను లింకఁ జెల్ల వం
చలవలరాజు చేతిసిరితాసియఁ బల్కయు నాన ముంగిట
న్నిలిపి స్వజన్మదేశమున ‡నిల్చెనునాఁ గనుపట్టె నారును
నులుకటురంబు నల్లయదుకుంజరుఁ డొప్పుఁజుమీ యహర్పతీ.

---

*యందండత-మూ. †ఖమసద్భుజ-మూ. ‡నిల్చెనసా-మూ

క. చతురాస్యసదనమారుతో, గతిచే వక్షమున కెగసి కనుపడునాభీ
విశాలిపయోరుహకేసర, వితతి యనం గౌస్తుభంబు వెలయున్ హరికిన్.

క. ఒత్తుటలువనుచు మార్గన, భృత్తియు *సుస్వనత లేక వెలవెలఁబోచున్
రిత్తనడి శంఖ మచ్చ్యుతు, కుత్తుకయై పొలిచి పలిచె గుణనిధి యగుచున్.

క. మంజుభుజకీర్తిహీరా, సంజనితధవళిమము భూమిసాకల్యధురా
రంజితము కంసదానవ, భంజనుకే లమరు శేషఫణిసన్నిభమై.

చ. తను వెలగాఁ గొనుం బసిఁడి దాస మెలంగుటఁగాని చెల్వులే
దని యలకెంపు తద్విభుశయద్వయమై నవరత్నకోటికాం
చనితను †నియఁ బుచ్చుకొనసాగి విరోమసదోషభావతన్
గొనబు వహించుఁ జూడ్కులకుఁ గోరిక లీరక లీనుచుండఁగన్.

క. అకలంకగోవిలాస, ప్రకటిత దోషాపరుద్ధభావతఁ గొనుచు
న్వికసించు తన్నఖంబున, కకటా దుష్టములు నెలయు నబ్జము సరియే.

చ. తనిమిగొను ముద్దుకై తలఁచు తామరసాలయకన్య కన్యకా
భరిమ జనియింపఁ దచ్చనకుఁ బన్నిన నిద్దపుఁదళ్కుమించుట
ద్దము లనఁ దోఁచు జూపతిశఁ దద్దయు మేల్మినుజెక్కు లారచి
త్తమునను వాక్కునం దలఁపఁ దత్ప్రభ సన్నుతిసేయ శక్యమే.

క. బలుగంప్పు నోపఁ బవడము, జలజాక్షుని మోవి యయ్యె సాగెనట వధూ
విలసద్రదనక్షతములు, తొలఁగ దెచట శాధ రాగదోషము గొన్నన్.

చ. ఘనవదనాలవాలమునఁ గన్పడుచున్నధ నాటు దేరి చి
న్నినగవు చెన్నెలం గలసి చిక్కనయప్పవడంపు మోసులో
యన రదనాళి యింపొనరె నాదటఁ దక్కనలం బనంగఁ గృ
ష్ణునిమధురాధరంబు గడుసొంపు వహించు సిలింపవందితా.

క. కమలాహితవరకాంతులు, శమితతిమిరజాస్తు లమలసత్పథవర్తుల్
భ్రమిశోరు తారకంబులు, కమలాక్షునియంబకములు కడుఁ దనరారున్.

ఉ. భవ్యతరంబుగా భరణభారసలాంఛితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతయమనం బయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజులను దైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యదుదారనైఖరులు తెల్పఁగనా కగునే విభాకరా.

*సుస్వనత-మూ †విమ్మ.మూ.

క. శ్రీవిన్ శ్రుతిపదగము లై, భావింప సువర్ణశబ్దభరణాంకము లై
దైవాఱి మంగళమహా, శ్రీవృత్తము లగుచుఁ బొలిచె శ్రీపతిపేరుల్.

క. హరికవ్యంబపరిగడ్డము, *సారిదిగ నవ్వదనచంద్రుఁ జుట్టుకొను దళ
త్స్మరరాజనీలశోభా, పరివంధిప్రభలఁ దంపుపరివేష మనన్.

క. హరిచెక్కుల సొంపారెను, గురుతరనవపద్మరాగకుండలరుచి శ్రీ
తరుణీకృతచుంబనవి. స్ఫురదురుతాంబూలరాగముం దలఁపింపన్.

గీ. విషయగంధరాగవిహ్వృతిచేఁ జెన్నారు. కమలపత్రనేత్రఘ్రాణమునకు
విషయ మనఁగరాదు వివరింపఁగా గంధ, ఫలిని†గంధమాత్రఫలిత మగుటఁ

క. గుణవృద్ధులగుచు రాజిలు, ఫణిరాజశయానుబొమలు పరికించునుగా
గుణిగణము వక్రమే †యిని, గణుతింపఁగ వక్రతము మొకాఁ‡ యిదియను చున్

క. చక్షుఃప్రియమృగమదతిల, కాక్షీణసులక్షణైకహారి యగురమా
ధ్యక్షునలికంబునకు నప, లక్షణవక్రింపు నెల తుల యసం దగునే.

గీ. ప్రథమ కైవడి సత్కళాప్రభవహించు, దీపితాకారమై సంవృతి కెన యగును
శక్యమే సన్నుతికి యదుసార్వభౌము, లాలితచ్ఛాయమృదులనిటాలతలము.

గీ. మహితజలధరమాలికామైత్రిఁ గాంచి, వఱలుచుండెనుహరివాలబంధ మొప్ప
లఘుగుణౌజ్వల్యముఖ్యాత రాజిలంగఁ, జాల రహిఁజెందుచంపకమాలి కమర.

గీ. అతనిసౌందర్య మతనికళ్యాణగుణము, లనవశేషంబుగా నెన్న నఁవిగాదు
వదనములు నాల్గు గల్గినవానికైనఁ, దలఁపు వేయింట మొలఁగెడు చిలువకైన.

ఉ. అట్టిసమస్తలోకనిధి యట్టిజగద్ధితవేషధూర్వహుం
డట్టిదయాపయోనిధి యట్టితమోపహనామకీర్తనుం
డట్టివిచిత్రరూపఖని యట్టిమహాద్భుతకార్యకర్త నీ
పట్టికి మేలుపట్టయిన ప్రేట్టు సుమీ పరికించి చెప్పితిన్.

క. మదిలోపల నిక్కార్యము, వదల ననౌచిత్య మచట వదలదును వదా
వదవదనవనజములు సమ, పదభాషితభూషణంబు పద మందదుగా.

గీ. అబ్జబాంధవ యింతపర్యంత మిట్లు, హరికథాగోష్ఠి సమయ మత్యంతమధుర
మగుచు వెడలెరు సత్యలోకానుసరణ, వాంఛ దీర్పంగ నానతీవలయునవిన.

---

*సారిదిగనన్ వదనచంద్ర- †గంధమాత్ర పలిత-మూ. ‡రెంప తావుల 'యిని' యనియేగలదు.

సీ. ఇట్లు బలు *పోటుమాటలనింపుగాంచు, మించుజడదారిరతనంపు మేలుమాట
లాలకించి ముదంబాత్మఁ జాల నించి, మునుఁడుసద్భక్తిఁబల్కె మెల్లనహసించి.

ఉ. అంతిక మోహనాంగములు పాయుప సేసుప్ప గర్గినాకు నే
కాంత మహంత మా నుడువు మంది తపంతిపదంబు గంటి శ్రీ
రాంగసుధానిశాంతకథఁ గర్ణయుగం బొగిఁ దన్పి తీవ్ర వా
క్కాంటలిసిరాడ నమ్రజనకల్పకభూజ సునీజనోత్తమా.

క. ఏకగుణహాని యెఱుఁగని, లోక విశేషోక్తి యందు శోభిలు నమ్మో
శ్రీకలితసామ్యదార్ఢ్యము. లోకహితాచార బోధలులితవికారా.

గీ. అనఘ మీరావళిద్విజయుల్లు నడచుఁ,గాక యీజనుఁడన్యథాగతి మోఁగు నె
ప్పైనికోక్తి కమీవంటివారిమాట, కరయ సత్యత నీరెంటి కర్థమొకటి.

వ. ఇట్లు వచించి విరించితనయునకు సవినయంబుగా సహాస్కరుండు నమస్క
రించి యుగం డనుగఁ గొంతద వ్యనుగమించి మగుడఁ దదనుజ్ఞ భరించి తిరిగి
వచ్చి కూఁతుం గాంచి గుచ్చి కౌఁగిలించి మెచ్చుగా ముచ్చట దీర న
మూల్యభూషణాంబరంబులు ధరింపించి తక్కనసీల వేణీముఖసఖీజనంబులకుఁ
దగిన సభాజనంబులు సభాజనద్రుక్సభాజనంబుగాఁ గావించి యుయ్యంతి*మొ
లపుటింపులతో నంతిపురంబునకు ననుపుటయు.

క. పగివాగ్యరూప విసమ. †చ్ఛలీంవమార్గవిధానదక్షసంస్కృతనామా
సుగమాస్య మానస్వచరితా, పరతనమానిందద్రి హృదయపంకజభృంగా.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి
మాధవయజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజన
వంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణశశాంక అభినవసన్నయ
భట్టారకాహోబలపత్యాహ్వయకవిమహోపాధ్యాయభట్టారక ప్రణీతం బైనకాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమా
శ్వాసము.



*ఇంగ్ లితాంగుల-మనంతోపుటింపులు. †సగమార్గవిధాన. ‡లలితాత్మ-మూ.

(శ్రీ)

# కాళిందీకన్యాపరిణయము

—: ద్వితీయాశ్వాసము :—

క. శ్రీమైథిలీమనోహర, కామితఫలదాయ సుజనకల్పమహీజా
శ్యామలవిగ్రహ నుతసు, త్రామా సాకేతధామ దశరథరామా! ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము, ౨

క. తనతండ్రికి నారదుఁడా, వనజాక్షుచరితములను వర్ణింపంగా
విని మనము నాఁటి కామిని, తనకుం దగిపట్టి విభుఁ డతండని తలఁచెన్. ౩

ఉ. ఉల్లము రంజిలం దనుఁ బయోరుహ*నేత్రలు గొల్వ వచ్చి తాఁ
దల్లికి మ్రొక్కి యాయమ ముదంబున సేస లొసంగి దీవనల్
తెల్లముగా నొనర్ప నొకతీరునఁ గైకొని యొయ్య నొయ్య నే
పల్లవపాణి యందుఁ దనుబంగరుగద్దియఁ జేరెఁ జింతతోన్. ౪

చ. వనజభవేంద్రచంద్రధరవాఙ్మనసాతిగమై వెలుంగు కృ
ష్ణునిలలి సొంపు నింపు జిగిసోఁకు గము న్విభవంబునుం ద్రిగా
తనకు నారదుండు తదుదంతము సాంతముగాఁగఁ జెప్పఁగా
విని మెలంత కచ్చువడి వేగ మెఱ్పె హృదంబుజంబునన్. ౫

చ. తలఁచినయంతనే మిగుల దప్పికఁ జేపఁగ సంతతంతసు
న్వాలపుఁలు చింత వంత బలవంతపుఁగాఁకలు వింతసేయుఁగాఁ
జెలుల కెఱుంగనీక తనచెక్కిటఁ జెయ్యిడ నేరకుండె నా
జలరుహపాణి మాధ్యమునఁ జెయ్యిలు దక్కుచు లోనఁ గుందు మన్. ౬

ఉ. పీనుల విన్న యంతయును వెన్నునిచక్కఁదనంబు సంతత
ధ్యానము సేయుచో నతపయాకృతి కన్నులఁ గట్టినట్లనై
మానుగఁ దోఁచినంతటన మానిని సిగ్గున మోము వాంచి తం
గానమి నంతలో వగచి కన్నుల నించును బాష్పపూరముల్. ౭

చ. నెలఁతకు వెంటనే మరుఁడు నెమ్మది కొల్మి వియోగవహ్ని గా
ల్పోలుపను మించఁగా వెడలు క్రొత్తటిగాడ్పున వేఁడియూర్పు లై
ల్ద్రోలఁకెఁ దదుద్గతాభినవధూమఘనాంకురపాళినాఁ బయిం
బులకలు నిండెఁ దద్రసముపోలికఁ గ్రమ్మెఁ శ్రమాంబు చెక్కులన్. ౮

---

* నేత్రలు, మూ.

చ. తఱుఁగక నే మెలంగినను దామర*కంటికి మోము వచ్చెనో
నెఱిఁ దొవరంగు పొంగిచెను నీటరి సాటి యటంచుఁ బల్కఁగా
నుఱియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీతము గాదటంచుఁ దా
నఱవఱ లయ్యెఁ జెప్పఁట నొయారపుఁగస్తురిబొట్టు మోమునన్. ౯

ఉ. క్రమ్మిన చెక్కుఁ గ్రొంజెమట గప్పుకరంబులఁ గ్రమ్ముచున్ గగు
ర్పొమ్ము పైఁడిదువ్వలువ మూఁత దలిర్పఁగఁ గోక ల్మది
న్మన్మథ మేనియు న్నలఁగఁ బూని త్రపావశత న్వయస్యలం
గొమ్మ యెఱుంగనీక యటు గొంత మెలంగెఁ బ్రమోహమగ్నయై ౧౦

క. ఈగతి విన్నంతనె మను, లాగక శ్రీపతి హృదంబుజాస్థపునస్సా
భాగరిమన్ గలిగెను నాఁ, గనఁబడియెన్ రమేశురూపం బెల్లన్.

ఉ. శౌరియచింత్యరూపపటుసంపద సింగిణి గాఁగ దర్పకో
దారత నారిగా హరిప్రధానమనోహరసౌమనస్యశృం
గారము లంపకోలలుగఁ గైకొని మన్మథుఁ డేయఁజొచ్చె నే
పార శరీరపేశలము లైనతలోదరిసుప్రతీకముల్. ౧౨

ఉ. ఈయమసార్వభౌముకథ లిట్టివి భావభవానుమోదదం
బై యెదఁ బాయకుండె సఖులార సదా యతనుప్రభావమో
హాహో యని వారువారుఁ బ్రకృతోక్తు లన స్వని మగ్గ గావున
న్నా యెడఁ గూర్చి పల్కు టని నానసతానన యై వసింపుచున్. ౧౩

వ. అంత నగ్గద్దియనుండి ముద్దియ దిగ్గన లేచి. ౧౪

సీ. శుక్తికానిర్ముక్తముక్తికంబులరీతిఁ గన్నుల బాష్పంబుకణము లొలుక
జాలాంతరవిలోలచక్రద్వయములీలఁ జన్గవ పైఁటలోఁ జొకళింప
ఘనసంఘనిర్గతకరకలకరణిఁ గాఁ దుఱుమున నరవిరు ల్జారఁగుచుండ
సారసోపరిహిమజలబిందువులపోల్కి మోమునఁ జెమ్మట మొల్లలెత్త
నడుము గడగడ వడఁకఁగ †బెడఁగుగడవ
నుడిగెపుఁబడంతు లుడిగెము లొగిఁ బరాకు
చేయుచును జెల్వకైదండ సేయ నదియు
నిచ్చగింపక యింటికి నేగి యచట. ౧౫

* కంటుక—మూలము. † బెగడు కడవ—మూ.

—: కాళిందివిరహావస్థ :—

క. కసికాటుగ భుజియింపుచు, విసువున నేతెంచి పాన్పు వెసఁ జేరె మనో
రసజాతతీవ్రవిరహాభ,రసుమస్సహతాప యాచు రమణి రయమునన్. ౧౭

చ. ఎడయనిమోహవేదనల నెంతయుఁ గుందుచుఁ గృష్ణురూప మే
ర్పడ ననులేఁతకల్పతరుపత్రముమీఁదట వ్రాయు వ్రాసి యిం
పడరఁగఁ జూచుఁ జూచి తనయక్కునఁ జేరిచి ముద్దుగొంచు నా
పఁడతుక నెమ్మదిం బొడమి పాయనిప్రేముడి రేఁప నెంతయున్. ౧౮

క. వనితకుఁ దాపజ్వర మెచ్చినచోఁ బ్రియుకథల రతిని జెందుచు ననిశం
బును మెలఁగ నయ్యపథ్యం,బునఁ గాదే మిగులఁ దాపము న్గజకెక్కెన్.

గీ. సంతతధ్యాతహరికథాసరసిలోన, నెప్పుడును దేలుచుండు నాయిగురుఁబోణి
కదియ సుమ్ము వియోగతాపాహిశజ్వ,రాంకురంబున కగుహేతు వాదిమంబు.

సీ. తళుకొత్తుచెక్కుటద్దములకాంతులతోడ మందహాసంబులు మంద మయ్యెఁ
జెలులతోఁ జేయుముద్దుల ముచ్చటలతోడ శృంగారరచనలు రంగు దప్పె
నుమగకవెడలు నిట్టూర్పులగమితోన కన్నీటిముసుకులు గడలుకొనియె
నతిమనోహరరుచిరాకారములతోన మేల్మిబంగారునెమ్మేను డస్సె
మోహదశతోన కోరికల్మించుకొనియె, వెడఁదకన్నులతోఁ జేష్టవిప్పువదలె
బడలికలతోన చెమటలు వొడమఁ జొచ్చె, విరహవేదన నక్కాంత వేఁగుచుండ.

క. గురుతరమదనజ్వరవి,స్ఫురణం
జూడ నప్పుడు, ఖరశిఖిసంతప్తకనకకళికకు సరిదై. ౨౧

వ. ఇట్లు దినదినప్రవర్ధమానవిరహవేదనాదోదూయమానమానస
న నిట్లని వితర్కించె. ౨౨

చ. నిగమగణోక్తికిం బరమనిర్మలమానసవృత్తికి న్సదా
సొగియనియట్టి కృష్ణపదసూచితవస్తువుఁ గాంక్ష (సేసెదన్)
పయోనిధి నీఁదఁగోరెద
న్మిగుల సుధాంశుమండలము మిన్నక చేతులఁ బట్టఁ గోరెదన్. ౨౩

గీ. అమ్మచెల్ల మహావిరక్తాగ్రయాయి,
ధికరాగసదావృతస్వాంతులైన, మాదృశులకబ్బుననుచు నమ్మంగవచ్చు.

క. చిత్తము గోరిన నబ్బలు, విత్తము లభియించునెడ దు
వత్తరమై తాపవహ్ని వారకపుట్టెన్. ౨౪

సీ. నిఖిలగాయనగాయిపీమద్లభం బైన యింపులపాట నాకేల యబ్బె
నబ్బుఁగాకేమి నా
నంపుఁగాకేమి నే నగ్గతి వినిపింప నద్దివ్యముని యేల యటకు వచ్చె
వచ్చుఁగాకేమి యవ్వాసుదేవస్వామిలాలితచారిత్ర (యేలచెప్పె)
యచ్యుతునిఁ గోరె నీకోర్కి యజ్ఞరచిత
కావ్యశేఖరి విఫలతఁ గాంచి హాస్యపదము గానున్న దింకేటిబ్రుకుత్రోవ.

ఉ కన్నజ
విన్నయతండు దీర్ప మదిఁ బెట్టునొ పెట్టఁడొ ప్రేమఁ బూన న
న్నన్నలినాక్షుఁ డియ్యకొన నయ్యెడునో మఱి కాఁడొ యిట్టినా
బన్న ౨౭

గీ. వేఁడివేలుపు కృష్ణుని వేఁడఁబోవ, గురుత కొంచించు కాంక్షయే కొఱఁతవడిన
గౌరవము వోవు నని చెప్పఁగాఁ బనేమి ౨౮

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనిచానలు చాలఁజాల న
చ్చక్కఁదనాలకుప్ప యనుచంద్రునిఁ దామె వరించి రన్న నే
నొక్కతెఁ బోల నెట్లు
సౌఖ్య మీవిరహ మెట్లు తరించెద నేను దైవమా. ౨౯

క. అరయఁగ బహుకాంతాజన, వరణాస్పదమైన వరుని వరునిగ మదిలో
ధాత దా నఘమొందుఁ.

*    *    *    *

వ. ఇ ట్లూహించువేళ నబ్బాలయూహాబలంబున. ౩౧

ఉ. కన్నియయుంగకప్రదిమ గన్నులఁ దమ్ము జయింప బల్వెత
న్నిన్నక పంచతం గొనుచు మేల్గొనఁ దన్ను భజించు నమ్ములం
దిన్నఁగఁ దెల్విచేసి పగ దీర్పఁగ వేళ యిదంచు మన్మథుం
*డన్నువవెంట నంటుచు రయంబున లోఁగొనె నైదుబాణముల్. ౩౨

ఉ. తమ్ములఁ గల్వలు న్మరు బృథగ్గతి సాటికి రాక నీటిలోఁ
బమ్మి తపం బొనర్చి మెయి వాయుచు నెచ్చెలికన్ను లయ్యెఁగా
యమ్మదనప్రతాపతపనావృతిగాఁ దమచేష్ట వాయమిం
జు మ్మరవిప్పు మోడ్పులను జూడఁగ నయ్యెడు నింతినేత్రముల్. ౩౩

* డన్నువు వెంటు—మూలము.

క. కలువలుఁ దమ్ములు సరిరా, మెలఁగుట కోర్వంగలేక మెలఁతుకకన్నుల్
*బలుకోపుగదుర నిద్దుర, నొలయవను వికాసభావ మొదవుఁ దలఁచన్.
క. కాంతకు మదిఁ బుట్టెకుతల, పోంతలతో వేఁడియూరుపులతో మరుబ
న్బోంతలతో మయిపూఁతల, రోంతలతోఁ లేలు హ్రస్వలుప్తము లయ్యెన్. ౩౬
క. కృశగాత్రి యనుచు నెప్పుడుఁ, గుశబుద్ధులు పిలువఁ బీనకుచయుగంబుల్
కృశతఁ గొని బుధగణోక్తులు, వశమే తప్పింప నెట్టివారికి నైనన్
క. రవణములు †మీఱఁజిపడియెన్, ధవళేక్షణమేనుపేఁగ దాఁ గృశియింపన్
రవళి యిటు మాఱఁ జెల్లదు, తవిలెన్నాభస్యతయె నిల్వఁదరమాయనుచున్.
క. తరుణికిఁ గ్రమమున రుచితోఁ, నరుచులు మిక్కుటము లయ్యె నతివకురుచిగా
కురువేదన దినదిన మ, చ్చెరువుగ నంగంబు లెల్లఁ జిక్కఁగసాగెన్. ౩౮
క. ఆసమయంబున గుణవతి, యాసురచనసాధ్వలంక్రియాసాహిత్యా
భ్యాసము చేసి నిజేష్టర, సాసన్నస్వాంతవృత్తి యై వర్తిల్లెన్. ౩౯
ఉ. ఉత్తమగాత్రి కట్టియెడ నుత్తమ మయ్యెను గేశపాశ ము
త్యుత్తమ మయ్యెఁ జిత్తము మహోత్తమ మయ్యెఁ గటిప్రదేశ మే
కోత్తమ మయ్యె మోహనపయోధరయుగ్మము చిక్కనంగను
ల్మత్తచకోరలోచనకు మధ్యమువైఖరిఁ గాంచెఁ జిక్కుచున్. ౪౦
చ. విరహనిదాఘకాలమున వేమఱు మోము వడంకసాగె ని
ర్భరహృదయానురాగరసవారిఝరు ల్వఱి కుబ్బ నూర్మికో
త్కరములు కంకణాకృతులఁ దాల్చె నెలంతను నొత మిత యి
ట్లరయ ఘటింపలేఁడె ఘటనాఘటనాకృతి మారుఁ డెంతయున్. ౪౧
గీ. మారనాడింధముఁడుతాపభారవహ్నిఁ
గ్రాఁచి తనతూపుమొనవాఁడి ‡కమ్మియుచ్చు
చేత సంఘర్షణముసేయఁ జిక్కిచిక్కి
కనఁగనఁగుఁ జెల్వలలితాంగకనకలతిక. ౪౨
గీ గోకులాయతచేష్టసంకోచ మొదవె, నెమ్మిపుటివిచ్చెఁ గాలుష్య మిమ్మఁ గొనియె
హంసజాతాంగయాతనాయత్తమైన, యతనుశరవర్షమవిరళంబగు నుంబర.గ.
మ. స్మరదావాగ్ని హృదంతరాళము దహింపం బైకిఁ బొంగెకుఁ ని
శ్చరపున్నాభతి యనంగ నంగమున ధావళ్యంబు దైవాత్త భీ

* బలునొప్పు— † మీఱుపడితన్— ‡ కలిమియుచ్చు— మూలము.

కరతలాగ్రమశరప్రవర్షణమునం గన్పట్టు దూర్వా(తృణాం)
కురపుల *జొంపమునంగఁ దీప్తు నెఱపెఁ గుంపై నెఱు ల్గోమునన్. ౮౭

గీ. ధార్తరాష్ట్రనినాదంబు లార్తులొదవ, మీఱఁగాఁ బాండురాజకుమారగోచు
లనుగ సద్వర్గమామోదమంద మెలఁగ, నతనుశరశయ్య గాంగేయసుతను †వారగె

క. పువ్వుఁ విలుతునిపువ్వుల, ఉవ్వుల ననుఁబూలబంతిఉవ్వులు మఱచెం
బువ్వులు నవ్వులు మఱచెఁ, బువ్వులు దవ్వులను మఱచెఁ బూఁబోణి తగన్.

సీ. తనువున ననమహాధనచేలము ధరింప దమలంపు మెకుకర్దము మలఁదకు
మోహనప్రాలంబముఖమాల్యములు గొన దలిరుచిరలలంతి కాదు లిసకు
భృంగికకథారణాంగీకృతికి రోయు నశనవాంఛకు దూర మగుచునుండుఁ
దాంబూలరుచు లానుతలఁపులో మెలఁగను చమురులపై భ్రాంతి యొదవనీదు
హీరమయపంజరాంతర చారుకీర, శారికారావములు వినఁ జేరఁ జనదు
చిత్తపద్మనికేతనశ్రీనివాస, రూపజాలంబులోఁ జిక్కి రుచిరగాత్రి. ౮౮

గీ. అతనుసుమహేతిసముదయం బతనుకుచను
నతనుసుమహేతిసముదయం బయ్యె నపుడు
అతిఘనాబ్జసుచిస్ఫూర్తి యబ్జనయన
కతిఘనాబ్జసుచిస్ఫూర్తి యగుచు మెలఁగె ౮౯

క. అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానఁ పూర్తిక కమలేక్షణకున్
అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానఁ పూర్తిగ గతిఁ గననయ్యెన్.

లయగ్రాహి. ఆటలకు ముందెసఁగుమాటలకు
నింపానరుపాటలకు లేనగవుతేటలకు నెమ్మే
నీటులకుఁ గప్పురపు వీటులకుఁ బూఁబఱపుఁ
జోటులకుఁ గేళివనవాటులకుఁ గూర్చుం
బోటులకు రేనిమరపాటులకు రవణముల
కోటులకు బోనముల నేటులకు శారీ
చాటులకు సౌధముల చోటులకుఁ గిశలయల
వాటులకు బాల యొలెవాటులకు రోసెన్. ౯౦

గీ. అంతరంగము మాధవధ్యానపటిమ
కలితమై యొప్పఁ దద్వశగతము లగుచు

* జొంపముచారి— † వరగె— మూలము.

నఖిలవిషయములు మెలఁగ బాహ్యాంబుమఱచి
యయ్యయోగిని యోగిని యనఁగఁ బరఁగె. ౫౧

క. అదిమఱచె నిదియుమఱచె, న్మదవతి యని పలుక నేల మది హరి నొకనిం
గదియించి మఱవదెప్పుడు, నదియునియను నేమి బాహ్యమంతయు మఱచెన్.

గీ. సర్వకార్యాంతరాయంబు సంఘటిల్లు, ప్రేషగెకొన్న ననిచూచి ప్రేషమాని
ప్రేషవతియాత్మలోని యాభీప్సితంబు, కన్నతండ్రికి వినుపింపఁగాఁ దలంచు.

చ. నగుఁ దల యూఁచుఁ గన్మొగుచు నల్గడఁ జూచు వడంకు లేచు బ
ల్వగగొను మ్రాన్పడుం బొరలు వాడును శౌరిఁ దలంచి వేఁడు నై
గగురుపుఁ జేర్చు నుస్సు రను గద్గదపాటు గనుం జెమర్చు నిం
పగుచెలిఁ బిల్చుఁ బల్కదువు నంబుజలోచన మన్మథార్త యై. ౫౪

శా. రంభారూపిణి చెట్టవట్టుకొన నారంభించు శ్రీకృష్ణుదో
స్తంభం బంచు గృహేంద్రనీలరచితస్తంభంబుఁ దచ్చారువ
క్త్రాంభోజం బని గేహకుడ్యఖచితప్రాంచన్మహాదర్పణం
బంభోజానన ముద్దులాడ మొగ మొయ్యం జేర్చుఁ గామార్త యై. ౫౫

శా. నేత్రమ్మీలన మశ్రుచైత్యవిరతం నిష్కంపతాం స్విన్నతాం
గాత్రం యాతిచ హృష్టరోమచయతాం కంపైకసంపన్నతామ్
పాత్రం దుశ్చ్యవిసంగతేర్భవతి సద్వక్త్రం చతైశ్వర్యభా
క్తత్రాత్మప్రభవాపణే స్సమజని శ్రీవాప్యయోగక్రమాత్. ౫౬

క. మదనాసమశరమయ మని, ముదమున లోకంబు లెల్లఁ బొగడుట నిజ మై
యొదవ మదనాగగామిని, మదనాసమశరమయంబు మానక యయ్యెన్.

క. అరయఁగ సస్ఫుటతాసు,దరతాస్విత మగుచు సాధుతాభావిత మై
తరుణీమణివచనము ప్రాగ్విరచితసరసప్రబంధవిధములు దెలుపున్. ౫౮

గీ. విషమశరశరవేదనోద్విగ్న యైన, వెలఁదిమైఁదీఁగ భారతీవృత్తిఁ గనియె
నట్టివేళన పంకేరుహాప్తసూతి, విన్ననిమొగంబు భారతీవృత్తి వదలె. ౫౯

గీ. వాక్కుతోడుత నత్తెటచెక్కులాఁడి
చాలఁజాలంగ నెడసెఁబాంచాలిపొందు
చిత్రమొనరంగనవ్వేళఁజెల్వమేను
చాలఁజాలంగఁ గొనియెఁ బాంచాలిపొందు. ౬౦

గీ. విషమబాణుఁడు విషమాస్త్రవేధ సేయ
నతనిమామ మహాతపం బడరి కాయ
నతసిసేనాఘనార్భటు లరిది డాయ
మోహనాకార బలు సైనమూర్ఛ మునిఁగె. ౬౧

—: కాళిందివేదనకుఁ గారణము నీలవేణి యడుగుట :—

వ. ఇబ్బాగి ననంగదశాలింగితాంగి యై పొరలు యమునాతరంగిణీసోదరిం గని సఖీసుముఖు లందఱు గుంపులు గూడి కూడనిమనంబున గుజగుజలఁ బోవ వారల వారించి యస్మింజుఁ బోఁడి విషాదంబు నివాదం బై సంభవిల్లుటఁ దన్నిదానం బిట్టి యని నిదానింప నంతఃకరణం బకరణంబుగా నేర దిది యే మొకో తెలియఁ దగు నని సఖీజనంబులు నెఱుంగకుండ రహస్యంబుగా నీలవేణి యయ్యలివేణి డాయం బోయి. ౬౨

ఉ. అల్లన లేవఁగాఁ దిగిచి యంకతలంబునఁ జేర్చి కన్నులం
జల్లఁగ జాఱునస్రువులసంతతి కైననఁ బాపి పెన్నెఱు
లెల్లన గుంపుదీర్చి చనుమిట్టలపైఁటఁ గుదిర్చి కౌఁగిటం
జల్లఁగ దార్చి చెక్కుఁగవఁ జక్కఁగ నొక్కుచు మేను దువ్వుచున్. ౬౩

క. అమ్మవు గద రెండవమను, నమ్మవు గద కాఁకదేఱ నట్టియుదిరిమే
లొమ్ము పెన్నవు గద మరు నాఱవ, యమ్మవుగద యనుచు ముద్దులానుచుఁ బలికెన్.

క. కన్నియ విశ్వంభరుకుఁడి, కన్నన రాజిల్లునట్టి ఘనుఁడు గదా నీ
కన్నట్టితండ్రి గావున, నెన్నఁగ దుర్లభము నీకు నెద్ది జగములన్. ౬౫

సీ. వ్యాకోచనలినంబు వన్నె తక్కువగాఁగఁ గన్నులు విప్పవే వన్నెలాఁడి
యుదితరాకాచంద్రు నొఱపు కొఱంతగా మోమెత్తి చూపవే ముద్దులాఁడి
కలికి చిల్కలపల్కు కులుకు లుల్కులఁ బెందఁ దేటగాఁ బల్కవే నీటులాఁడి
తఱపి వెన్నెలరంగు తలఁపులో మెలఁగంగ గొబ్బుగా నవ్వవే గుబ్బలాఁడి
విన్నఁదన మేటికే నీకు వింతలాఁడి, యేమి కన్నీరు నించెదే యించులాఁడి
వగకు నింతకుఁబని యేమి సొగసులాఁడి, తెలుపవే తెల్లముగ మోవితీపులాఁడి.

గీ. మగువ యక్లిష్టముఖపద్మమండలమునఁ
బాయకుండెడు బిందుసంపాతమునను
మాధురులు దేల్పఁ దలఁచిలో మాఁకుఁ దెలియఁ
బలుకఁగాఁ జిత్త మిడవమ్మ పైఁడిబొమ్మ. ౬౬

శా. కొమ్మా నీవిధ మెంతయుం దెలియ మాకుం దోఁచ దేమన్న నీ
విన్నా లోపలఁ గుందుచున్నదిఁ గని మా కెంతే భయం బయ్యెడు
న్నమ్మి న్నీ కొనఁగూర్చు నెచ్చెలిని నే నిన్నంటి యుండంగ నో
యమ్మా చెప్పిన దోసమే మొఱుకసేయన్రాదె యే వింతనే. ౧౯

క. ఏమైన మున్ను నాతో, నేమంబునఁ జెప్పకుండు నీకిపు డేవిం
తేమన్న తెలియఁ బలుకవు, తామరసదళాక్షి యింత దాఁపుర మేలా.

గీ. అతివ నీప్రాణపద మైనయట్టివస్తు
వితతిఁ బో గొట్టికొన్నట్టివిధము దోఁచు
చున్నయది నాకుఁ జూడ నోసన్నుతాంగి
మాయ వెట్టక యెఱిఁగింపుమా నిజముగ. ౨౦

క. మానుగ నాకన్నను నెన, రైనచెలు లీకుఁ గలరె యరమర సేయం
గా నేల తెలుపు నీతం, డ్రానసుమీ నలువతండ్రియానయుఁ జుమ్మా. ౨౧

ఉ. ఈగతి నీలవేణి కమలేక్షునియాన మెలంగఁ బల్కఁగా
నాగజయాన సిగ్గు మది నాఁటఁగఁ గొంకుచుఁ గొంత దేఱి చే
తోగతిఁ బ్రేమతోడ వగ దొట్రకొన న్మను నారదుండు దా
నాగరుడధ్వజుం దెలుపు టాదిగ నంతయుఁ జెప్పెఁ జెప్పినన్. ౨౨

వ. విని యక్కాళిందీకీరవాణికి నానీలవేణి యొక్కింతవిచారించి యిట్లనియె. ౨౩

క. ఇంతీ యీతటిపనికిం, జింతింపఁగ నేల యొకటి చెప్పెద వినుమీ
యెంతైనఁ దల్లిదండ్రుల, వంతుసుమీ కూఁతుఁ దగినవరునిం గూర్పన్. ౨౪

వ. అదియునుంగాక. ౨౫

గీ. బాల్యమున మాతృపితరులుఁ బ్రాయమునను
మగఁడు *ముదిమిని దనయుండు మగువ కరయ
నధిపు లగుదురు తదధీన లగుటఁ గాన
మానవతులకుఁ దమయిచ్చ మలయఁజనదు.  ౨౬

క. జనకాధీనలు కన్నియ, లనుట నిజం బౌట వార లనుమతి సేయం
జనుఁ గాని తమకుఁ దామే, పనుపడి వరుఁ జేరఁ దగదు బాలల కెన్నన్.

వ. కావున మావలన నీవిధం బెఱింగి నీతండ్రి యగులోకలోచనుం డుచితో
పాయంబున శ్రీకృష్ణదేవుని రప్పించి నీమనోరథంబు సఫలంబుగాఁ బెండ్లి
సేయు నంతకు ధైర్యం బవలంబించి యుండు మని పల్కిన నీలవేణికిఁ గా
ళింది యిట్లనియె. ౨౮

* ముదిమిచు-మూ.

—( కాళింది నీలవేణికిఁ దనయభిప్రాయంబుఁ జెప్పుట )—

ఉ. కూఁతురు పుట్టినన్ జగతిఁ గోరికతోఁ దలిదండ్రు లెల్లెడన్
ఖ్యాతిదనర్చు మేల్వరుని బంధులలో వెదకంగఁ జూతు రి
ట్లీతఱి *నప్రయత్నగతి నిట్టివిభుండు లభించు నప్పు డ
య్యో తలిదండ్రు లేలొకొ నయోచితిఁ గూర్పఁగఁ జాల రంగనా. ౭౯

ఉ. తల్లి ధనాఢ్యు సత్కులునిఁ దండ్రియు బంధులు సత్కులీనుఁ గా
నెల్లరు నోదనప్రదుని నెన్నఁగఁ గన్నియ రూపవంతుఁగా
నెల్లెడఁ గోరు నిన్నియును నేడ్తెఱిఁ గల్గినకృష్ణుఁ గూర్పలే
రుల్లము రంజిలం దన కయోచెల యిట్టి యయోగ మారఁగన్. ౮౦

శా. ఎన్నాళ్లో గాలె నాకుఁ గూర్మి గలవారే కా చెలు ల్వీరలై
నన్నున్ డెందమునందుఁ బొందుపఱుపంగాఁ జాల రై రక్కటా
నన్నుం గాంచిన తండ్రిగా తపనుఁ డైనం దాఁ బ్రసన్నుండుగా
కున్న న్వెన్నుని మన్నన న్నెనయఁగా నూహించువా రెవ్వరో. ౮౧

చ. తమమది నెన్నసా వరుని దార్చినకన్యలబుద్ధి నెట్లుగా
నమరునొ యంచుఁ గాదె జను లట్ల స్వయంవరకల్పితిఁ గాంతు రిం
తమనికితంబు లేక యిటు నాథుని మాధవుగాఁగఁ గోరికొం
టి మది గరంగి తండ్రియు వడిన్ ఘటియింపఁ డి దెట్టిభాగ్యమో. ౮౨

ఉ. కాఁకలు ముంచికొన్నమెయి గాంచినవానికి జన్మమంది నేఁ
గాఁకలు ముంచికొన్నమెయి గాంచితి హేతుగుణంబు గార్యము
న్సోఁకదె తప్పనంటిఁ గొఱనోములు నోఁచిననాక యిట్టి బ
ల్కాఁకలు గాక యాజమున కాఁకలు గాంచెనె సూర్యజాత యై. ౮౩

చ. గ్రహములు గన్నవారు గ్రహరాజకుమారిక సాటి గాంతు రే
రహి నని తోడ నాడఁగ విరాజిలుదుష్మది నట్టివారె ప్ర
త్యహ మవియుక్తలై కువలయాప్తశిలామయసౌధవీథిలో
బహువిధసౌఖ్యము ల్గనఁగఁ బంకజలోచన నేనె చూచెదన్. ౮౪

వ. అని యిట్లుత్తలపడి పలుకు నమ్మత్తకాశినిచిత్తంబు పురుషోత్తమాయత్తం
బగుట రుజొంగి యన్నీలవేణి యప్పువ్వుఁబోణి కిట్లనియె. ౮౫

*సంప్రయత్న-మూ.

క. ఇపు డేను బోయి రవికిం, గృపపుట్టఁగఁ దెలియఁబలికి కృష్ణుని బిలువం
జపలాక్షి పంపి వచ్చెదఁ, జపలత వోనాడి స్థిరతసంధిల*వమ్మా. ౭౬

గీ. అనిన సమ్మతించి యతివ ధైర్యంబూని, చలన ముడిగి కొంత శాంతిఁబొంది
స్నానపానవిధులు సలుపుచు నొకరీతిఁ, జెలులఁ గలసి మెలఁగి చింతదేఱి.

ఉ. అంతట నీలవేణి చెలు లందఱ కవ్విధ మెల్లఁ జెప్పి మీ
రెంతయు నాటఁ బాట మఱి యింపుల గానవిశేషవైఖరిన్
ఇంతికిఁ గృష్ణుపై మమత యించుక యైనను దోఁపకుండునా
వింతలు చూపుచుండుఁ డిట వేగమె యేఁ జని వచ్చునంతకున్. ౭౭

—( నీలవేణి ఛాయాదేవికిఁ గాళిందివృత్తాంతముఁ దెలుప నేగుట )—

సీ. అని నీలవేణి యి ట్లతివలతోఁ జెప్పి కాళింది నూరార్చి కడఁకమీఱ
నతిరయంబునను ఛాయాదేవికడ కేగి సరవి నాయమ కుపచారవిధులు
సలుపుచు సుతవార్తఁ దెలిపి వేవెలుఁగున కావార్తఁ దెలుపంగ నవసరంబు
వడయక సందడిఁ బడియుండె నిచటఁ గాళిందియుఁ దమకూర్చు లేమగముల
యాటపాటల వింత సయ్యాటములను,హంసగతులను గేకినాట్యములఁజిలుక
పలుకులనుమఱుపుట్టింపఁబడియుఁబడక,వంతమరుఁడేఁపమ్మ స్థావస్థఁజెంది.

చ. బయలును గౌఁగిలింపఁ గయిబారలు సాఁచు వికావిక న్నగుం
బయఁటఁదొలంగి కన్నడుఘన స్తనగుచ్ఛము లప్పళించు మ
న్నయమఱి పాదుదప్పి ధర నల్గుడు గైకొను పువ్వుఁదీఁగెఁ బో
లి యొరలి సజ్జపైఁ బొరలి లేచు వగ న్నరుబారి కగ్గమై. ౮౦

క. చదల శశాంకుని గనుఁగొని, మదిలో శ్రీకృష్ణు వదనమండల మనుచున్
ముద మొదవ సువదనామణి, వదనం బొగి వాంచి ప్రేలవసుధన్ వ్రాయున్.

చ. వలపులు గుల్కు పంకజము వారిజలోచను వక్త్రమంచుఁ దా
వలపులు బల్వు గైకొనఁగ వాసనచూపఁ దదంతరాళస
మ్మిళదళి వే చుఱుక్కనఁగ మెత్తనివాతెఱ నంట నొచ్చెరా
తలతలలోరి ఘూర్త యని తన్వి మొగం బెగఁ ద్రిప్పు వేమఱున్. ౮౨

చ. చెలువలు మేనిపూఁతకయి చెంగటఁ బెట్టు మృగీమదంబుఁ దాఁ
నొలయక †యొల్లమీఱి వికచోత్పలలోచన రోషవీక్షణాం

* గమ్మా. † నొల్లమీరి వెనుకన్ వికసితోత్పల-మూ.

చలములఁ జుఱ్ఱరం గను నిజప్రియసీలతనూపమంబుగా
మలయజగంధి గన్గొను సమందరసావహదృష్టిలీలలన్. ౯౩

క. ఘనసారరజముఁ జూడఁగ, వనజేక్షణ వెఱచి శౌరివరహాసన్ శ్రీ
తనరు నని తలఁచి వేమఱుఁ, గనుఁగొను నొకకొంతతడవు కడుమోదమునన్

ఉ. సిగ్గున మోము వాంచి నునుఁజెక్కులఁ జెమ్మట గ్రమ్మఁదేఱ మే
ల్జగ్గు మిటారిగుబ్బచనుజక్కవ లుక్కున నిక్కి గ్రక్కునన్
లొగ్గక పైఁటఁజీఱవికలో నుమటారఁగ సారసాక్షి చే
నిగ్గులతన్మి ద్రిప్పు హరినిగ్రపుఁగైసుడివాలు *డంబుగన్. ౯౪

సీ. మృదులఫాలమునందుమృగమదంబుధరించి యొప్పునఁజారురత్నమ్ముఁబూని
నాసికాగ్రమునందు నవ్యమౌక్తిక మూని కరమున రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి రాణించుపీతాంబరంబు గట్టి
కొంతతడవు సుఖింపదు కోమలాంగి, యాత్మనాయకకమలాసహాయవేష
సముచితాలంక్రియావస్తుసమితిఁగొనుచు, నార్తిచేఁగొంత సేపునకవియుఁగినియు.

గీ. మాధవుఁడపొందునకు నేను మనసుపడితి
నింపు గాకున్న నతఁడు నన్నేలఁడేని
అక్కటా యిట్టి కథయు దృష్టాంత మగుచుఁ
బరఁగునో యేమొ యిల రసాభాసమునకు. ౯౫

సీ. ఏగతి నతనిపొందే నందనయ్యెద బహువల్లభాప్రియుఁ బడయ నేమి
నీరజాక్షుని గన నేన పోయెద వేగ నీయెడ నింకేమి సేయుదాన
నిదెతానెవిభుఁడిట కేలమినేతెంచెఁగా యితనిమోము గనంగ నెనయదుమతి
వేళంబ కావలె వెన్నునితోఁ బొందు నింతలో సీసాఖ్య మేల కల్గు
నిట్టిచెలువున మెలఁగెడు నింతివిడుచు, మనసు గైకొన వెఱ్ఱియే మాధవుండు
ననుచు మన్మథవేదన నబ్జవదన, భావభేదంబులను జాల బడలుచుండు. ౯౬

క. ఇట్లు దరిలేనివేదన నింతి యొఱల, నింతనంత మెలంగెడు నిగురుఁ†బోండ్లు
మిగులవగనూరుమనసుల మేలుదక్కి, భామ వినకుండ మెల్లనఁబల్కుకొనిరి.

గీ. తలఁప జగతి నయోగఖేదంబు గాంచు
వెలఁదులను గన్నయది లేదో వినఁగ లేదో

---

*దంబొగిన్. †బోణ్లు.

మనచెలి యవియోగవేదన గనఁగ నరిది
గడనసేయుచు విరహదుఃఖంబు నైన. ౧౦౦

క. మగబొమ్మఁ జూడనొల్లని, మగువ మగఁడు గావలె నని *మరుగుచు వేర
మ్మగుసిగ్గు మూలముట్టుగ, దిగఁద్రోచెను గాక యింతతీండ్రము గలదే. ౧౦౧

చ. అనుచుఁ దొడంగునిందుముఖుఁ లందఱు నెవ్వగఁ జెంది యొ†ల్లొకో
వనరుహపాణి నివ్వెతలఁ బాపుచుపాయము నీలవేణి వ
చ్చినతరువాత నన్నియును జెల్వగుఁ జేరకపోయె నంచు ని
ల్వనఁ దలపోయువారలకు లోలవిలోచన డాసి నిల్చినన్. ౧౦౨

వ. ఇట్లు నిలిచిన నచ్చెలు లందఱు నీలవేణి మనమాటలోనె వచ్చె నిఁక నేల వలవనివలవంత చింత లనుచుఁ గచ్చుకొని తన్నుఁ జుట్టుకొని గజిబిజిపడు నగ్గజగమనలం గసరుకొని తనతరువాతిప్రోడ యగుశుకవాణి నిది యేమి యో యని యడిగిన నప్పడంతి యప్పొలంతి కి ట్లనియె. ౧౦౩

—। కాళిందివిరహమును శుకవాణి నీలవేణికిఁ జెప్పుట ।—

ఉ. కప్పురవీడ్య మొల్ల దొసఁగన్ జిలుగుల్ జిగినల్గ గట్టఁ గా
నొప్పదు చామరంపువిసరొపఁగఁ జాలదు పూలదండలం
గొప్పున నున్పఁగానియదు క్రొన్నెలుటద్దముఁ జూడ ‡దింకనే
మప్పరొ యూడిగంపుఁబను లప్పను లన్నియు మాని నింతికిన్. ౧౦౪

చ. దిరిసెపుఁబువ్వువంటి నునుదీఁనబంగరుమేను కాఁకచేఁ
దెరలఁగఁబాతె మైనసమదేర విభూషలు జాఱె: §జెమ్మువాలుం
గఱకటివాతె గుబ్బచనుగట్లు వణంకఁగ వేఁడియూర్పుల్
దఱచులు మీఱె నీకొలఁ దనం గనరాని విరాలిఁ గూరెడిన్. ౧౦౫

క. ఎక్కడితాపము చెలువకు, నక్కజ మిది చూడ ముక్కునందలిముత్యం
బెక్కడునూరుపుఁగాఁకల, నుక్కుచు బలవైరినీలరుచి నుక్కించెన్. ౧౦౬

ఉ. చక్కని పెన్నిటిం గొన విచారము సేయఁగఁ గార్యసిద్ధికి
న్నిక్కము చాలఁ దప్ప నటునిల్వఁగ నంటునఁ గందు దీనిమే
నెక్కెడ నిట్టితాపభర మెక్కడఁ గప్రపుఁదావు లీను నీ
చక్కనికొమ్మ నెమ్మనము చాల మహానలకీల లీనెడున్. ౧౦౭

*మగనిమరు వేరెమ్మ చు. †ట్లకొ. ‡జింతయే. §చైవులు-మూ.

చ. అలికులవేణిసన్ముఖమునందు వసించుద్విజాళి నాఁగు మే
ల్గల పవడంపుఁగో టగు చొకాటపుమోవిడి వేఁడియూర్పులన్
బలువిశిఖంబులం బగులువాఱఁగ నేసె మరుండు వానిమై
నిలువది యంత నీ అయిన నిక్కము గా మన యీసుదీటెమన్. ౧౦౮

మ. చ్యుతసంస్కారతఁ బొంది రక్తిను గుణస్ఫూర్తి న్నివారించి సం
తతపారుష్యము మించి సద్రసమృదుత్వంబు ల్విసర్జించి సం
గతిఁ దప్పించి ప్రగాంబు మించి కుకవిగ్రంథంబువోలెం గటా
సతిదంతచ్ఛద మొక్కహాస్యపవతం జాలించె వీక్షించితే. ౧౦౯

చ. హృదయమున *స్నివిష్టజగదేకభరాతతకుక్షి శౌరి దాఁ
గదలక యుండుటం బొడమెఁ గావలె మేన నలంత సేద ని
మ్మదితకుఁ దప్పదానుగతభూరిభుజంగవిషాగ్నికీల లో
వదలక నిల్వఁగాఁ బొడము వక్త్రవినిస్సరదాశుగావళుల్. ౧౧౦

క. అనలంకృతి వ్యాకీర్ణతఁ, గని యక్రమ మైపతత్ప్రకర్షం బగుచున్
వనజాక్షికచకలాపం, బనభిజ్ఞకవిత్వరీతి నతిఖిన్న మగున్. ౧౧౧

క. అక్క యిట్టింత చింతకు, నెక్కడిమే రకట చెక్కు నెడయమ హస్తం
బక్కుసుమధన్వుఁ జేయుం, జిక్కననిమసూఁడుఁదన్ని చిలుక న్మనఁగన్. ౧౧౨

ఉ. పంజరమధ్యసీమ శుకభామనుఁ బల్కులు నేర్ప దంచకు
న్నంజలు గూర్ప దున్నదశిఖాన్వితపాళికి నాట్యవైఖరుల్
రంజిలఁ జూప డింపు లలర న్నశిసేశియ మీాటి పాడ ది
వ్యాంజులవాణి †నొందిలిక మాతరమా తరలాక్షి చెప్పఁగన్. ౧౧౩

ఉ. అంగన కంగజాతదశ లంగమునం గడుఁ దోఁచె నందియం
బుంగన లేదు కృష్ణుకడ మోహము దాహము దాఁకె నేలయం
చుం గనుపించుకోక నతిచుట్టు పెులంగితి నీవు వచ్చి తిం
కం గర మారయం దగునుగా యనఁ జెల్లెలి కక్క యిట్లనున్. ౧౧౪

గీ. వినుము శుకవాణి నీకన్నమునుపు నాకుఁ, దోఁచె నేఁ జెల్లయీా చెల్వదోసమేమి
యువత యేనియు వెన్నుని ‡యవ్వనాఖ్య, భావరేఖావిలాసవిభ్రమము లెల్ల.

ఉ. కన్నులఁ గన్న పీనుఁగవఁ గ్రన్నన విన్న నటంత నే వడిం
గ్రొన్ననవిల్తుఁ డమ్ము విలుఁ గూర్ప నెడ న్నోగిలేక పైఁడిజం

*స్వవష్ట. †నిందలిక- మూ- ‡యావన- అనుట యుక్తము, గాని, పాదాదియందు యౌ వతయనుటకు యువతయని ప్రయోగించుటచేఁ గవిప్రయుక్త మిదియె యేమో. కాని ప్రామాదికము.

టన్నగు కన్నె గేడఁగి తుటారిమిటారి కటారిఁ దాఁగటా
కొన్నికఁ దీసి యాయమునసే యదరంటఁగ దానిఁ గృష్ణు డే. ౧౧౯

గీ. అయిన నిట్టిమాట యావెలందుక యొద్ద, ననిన డిల్లగుడుచు నట్లు గాన
నరయఁ దము పనుఁడని యతివలందఱు, దాను, నింతి యింటికేగి యెదుటనచట.

క. కనుఁగొను నెడ నచ్చేడియ, తనమది మదనానలంబు దరికొని కాల్పన్
వనటం బొగులుచుఁ గృష్ణుఁడు, తనకన్నులఁ గట్టినట్లు దనరినఁ బెలుచన్.

—॥ కాళింది మనసునఁ దోఁచినకృష్ణుని బ్రార్థించుట. ॥—

క. పలుకుం జెలి నునుముం జేఁ, బలుకుం జిగి ముద్దుఁ జిలుక పలుకులఁ బ్రోవం
బలుకుఁ గులుకొలుకు పలుకులు, పలికెం బాలు కూర్చి చిలుకు భావము దోలఁకన్.

ఉ. కాయము మారుబా(ణముల) గాయముల న్వగఁ జెంది వేఁడఁగా
దాయవు మోముఁ జూపవు గదా యముగుండియ పూని యేఁపఁగా
నాయము గాదు సిగ్గు విడ నాయముగా దని మిన్నకుండఁగాఁ
జేయదు పాప మీవలపు చిత్తము తత్తఱ మాఱఁ జేరవే. ౧౨౦

సీ. ఇపుడుగా కనుగల్వ లింపుసొంపులు మీఱి వెలసె నీరాకకు విబుధచంద్ర
యిపుడుగా యీమేన నెనయుతాపం బాఱె నినుఁ జూడ సత్కాంతిసీరవాహ
యిపుడుగా హృత్పద్మ మెసఁగె సామోదమై సరస నీవు మెలంగ సాధుసూర్య
యిపుడుగా మానసం బేర్చు ఖేదతమంబు స్రుక్కె నీచే సుతేజోహుతాశ
యిపుడుగా కామినీమాత్ర మెనయలేని, సౌఖ్యసంపదఁ గైకొంటి సన్నిధాన
మిపుడుగా సౌమనస్యంబు నిరవు కొనుచు, సొబగు మీఱఁగ నలరెద సురభిచరిత.

సుగంధి. మానరా చలంబు నిన్ను మాని యన్యుఁ బూనరా
పూనరా నిజార్తి మాన్పఁ బుణ్యమొందు గానరా
కానరా కృపం దనర్చి కావు నేను దీనరా
దీన రాసికీర్తి లేదు దేవ నీకు దానరా. ౧౨౨

ఉ. చొక్కఁటి నీదు ముద్దుజిగి చొక్కపుఁ బ్రాయపు రూపు మేల్మికిం
జిక్కిఁతిఁ గమ్మఁ జేనె జడిచిల్కలఁ (జిమ్మెడు) మారుబాకికిం
దక్కిఁతి నీకు వాఙ్మయసుధారసధారలు గ్రుమ్మరింపఁగా
గ్రక్కున గారవింపు బిగికౌఁగిట జాగిటు లేల యేలరా. ౧౨౩

చ. మనమొగి సర్వకాలమును మానక నిన్నె భజింపఁ దద్బలం
బున భవదాకృతిం గనియెఁ బుణ్యవరేణ్య మనంబు కూర్మియున్

మనసిజవేదనాభరము మానుగ దేవరకేల లేదొ యి
ట్లనఁ దగు నెట్లు నీవు ఘటితాఘటనాకృతినౌదు వీశ్వరా. ౧౨౪
చ. స్థిరత గనంగఁ జాల దొగిఁ జిత్తము బాహ్యవిశేషవస్తునం
సరణము గాంచు నంచుఁ బలుజంపులు సేయుచుఁ బ్రోవకుండెదో
యరయ నణుప్రమాణ మగునట్టిమనంబు సమస్తకుక్షి వై
పరఁగడు నీవు ముంచికొన బాహ్యముఁ జేరఁ జరింప నేర్చునే. ౧౨౫
ఉత్సాహ. వగపు జాఱ వగలు మీఱ వలపు లూరఁ జేరరా
నగవుసోన మొగముతోన నలువుపూనఁ బ్రబ్బరా
తగవు మానఁ జనదు గాన తలఁపులూనఁ గూడరా
బిగువుఁజన్ను లురముచెన్నుఁ బెరయ నన్ను నంటరా. ౧౨౬
క. కరుణ నొడము నీచరణం, గరుణ స్వనతఁ బలుక మదిఁ గనఁబడు మాయా
తరుణుఁ డూరకయుండినఁ, దరుణీమణి హృదయసీమఁ దలకొనునలుకన్.
గీ. నెనరుచేఁ బాలొసంగెడు నెలఁతపాలు, విసముగాఁదలపోయుచుఁ బిన్ననాఁడు
అకట తెగఁ గ్రోల్చు పనివాఁడ వౌటఁ దెలిసి, వెండి నినుఁగోరుటెల్లను వెఱ్ఱిగాదె.
చ. కల నయినం బయిం గనుట గానని వ్రేతలనెల్ల శీలముం
దొలఁగ విరాళి ముంచి రతిఁ దోఁగఁగఁ జేసితి వాదియందు ని
వ్వల బతిమాలినం దిరిగి వంగియుఁ జూడ వటన్న నిక్కాని
స్గలయఁగఁ గూడ దా వలపు గట్టిగఁ బట్టి న దేమి సేయుదున్. ౧౨౯
క. అగుణుఁ డరూపుఁ డనాముం, డగుట న్నాకతఁడు లక్ష్యమా యని శ్రుతులే
తెగి చాటి చెప్పఁ దెలిసియుఁ, దగని తగులునకు మనంబుఁ దాఁ బరువెత్తెన్.
చ. మునుపటిపుట్టుక న్భువనమోహిని మైథిలకన్య (కూర్మి) నిం
డినతనభార్యఁ జిచ్చున వడింబడఁ జేసెను నిర్దయాత్ముఁ డై
నను నిపు డమ్మనోభవునవారతబాణపరంపరాహుతా
శనఘనకీల మ్రంద నిడఁ *జాలఁడె తాళఁడె వీఁడు జాణఁడే. ౧౩౧
గీ. ఒఱలు చిట్టి కృష్ణునోడ బెఱుంగకదూఱు, కొనుచు మోహవశతఁ గూరుచున్న
తరణితనయఁ జూచి తరుణులు మది మీఱు, నార్తి డాయవచ్చి యతివ కనిరి.
క. వచ్చె మననీలవేణి దె, మచ్చికఁ గను విచ్చి చూడు మనికిత మెల్లన్
విచ్చును సత్యం బాడెద, మొచ్చెము లే కిచ్చు లెల్ల నొదవెడుఁ దల్లీ. ౧౩౩

* జాలెదం.మూ.

వ. అని పలుక నచ్చిలుకలకొలికి యించుక కన్నువిచ్చి హెచ్చు మనోజవేదనాభరంబున. ౧౩౪

చ. అదె సఖులార పట్టుఁడు మదంతరశాంతిని తాంతరాగసంపదలు హరించి చోరుఁ డటు మాయముఁ జెందు నటంచుఁ బ్రాఁగా మదితరో వింటె యూ నప్పను ముద్దియకో యని తారకాణగా మది సరిపుచ్చుకొంచు నడుమానని నెవ్వగ నీలవేణియున్. ౧౩౫

ఉ. డాయఁగవచ్చి యమ్మరుకటారికి డాయఁగవచ్చు నెచ్చెలిం జాయసకర్మిఁ గౌఁగిటికిఁ జాల్పఁజేయుచుఁ దల్లి చింత నీ కేమెడ నేల చింతిత మొకించుకనాఁడు సహింపఁ జేకుఱుం గాయజునాన నానకృప గల్గఁగఁ గల్గని దేమి నీకగున్. ౧౩౬

క. పరమాణుమధ్య వినుమా, పరమాణుద్రష్టలేని పట్టఁగ నిది మాతరమా యనఁదగునట్టిది, పరమార్థం బైన దొరకుఁ బరమార్థముగన్.

క. తరళేక్షణ పరిమాణ, స్వరసంధిక్రియ విపత్తిఁజను పటుధైర్యస్ఫురణము తద్ధర్మాంచ, త్స్వరసంగతి సాటి శోకసంగతి కమరున్. ౧౩౭

గీ. ఇట్లు నీలవేణి యెంతేని నెనరునఁ, జెలులతోడఁ గలసి చింతదీర్పఁ జుచితమైనయట్టియుపచారములు చేయు,చుండియుంచు కేహయనేకదినమున.

క. ఇంతి యయోగవ్యథచే, నెంతయుఁ జెలువెక్కు మేన నెనయు గ్రియామాకాంతద్యుతులుం జెలియు ని,తాంతోష్ణనుచేత మిగులు తాంతతకలిమిన్.

క. మొగు లెఱుఁగనిబలుచిత్తడి,మిగుల నొగిలెఁగన్నుదోయి మెలఁతకు దానన్ మిగులుచు నవ్వాయితాపము, తొగకంటికిఁజిత్రమరయఁదోలఁగక నిలిచెన్.

—॥ కాళింది చెలుల మొఱఁగి యుద్యానమున కేగుట ॥—

వ. అప్పు డమ్మోహనాంగి సొంపు దొఱఁగి కుసుమశరుండు కుసుమశరాసనంబు గుదుసువడ భసలగుణంబునం బొసంగించి మించి కుసుమశరవిసరంబులు విస్మృమరగతిం గసరి ముసురుకొనఁ బరఁగింప వెఱఁగుపడి విరహపరితాపశరధిఁ దరియ దరి లే దని తదుద్భటభట చటులమహాటవిం బడి నడిందద్విశిఖశిఖిశిఖాసంఘాతంబుల నిడి యొడలు విడుతు నని కడింది సాహసంబున నుడిగంపుఁబడంతులఁ గూర్మిమడంతుల నెఱుంగ నీయక యొంటిఁ బడుకింటిలోని పొన్ను డిగ్గి వెడలి చనుసమయంబున. ౧౪౨

క. అత్యుద్ధతకుచజఘన, ప్రత్యక్షం బగుచుఁ గ్లేశపడు నవలగ్నం బత్యంతదుర్బలం బై, యత్యుద్ధతు లొదవఁ బేద కబ్బనె సుఖముల్. ౧౪౩

జంతిలె నక్కటా యొడలు చెచ్చెర వీడఁ దలంచినన్ క్షణం
బింతట నిల్వఁగాఁ దొరకునేమొ యిటేలొకొ దాఁటి వచ్చితిన్. ౧౫౩

వ. అనుచుఁ జింతింపుచుఁ గనువిచ్చి కనుంగొనఁ గట్టెదుట నంత. ౧౫౪

ఉ. తామరతూఁడునాళములఁ దార్కొను నెమ్మొద యిప్పగుండు లు
ద్దామతఁ గూర్చి నల్లగిసె తావులపుప్పొడిమందు గూరియున్
హేమలత ల్సుమాగ్నిశిఖ లేరుచుజానకి త్రిప్పమర్చి యా
పై మొగరంబుగట్టిన తుపాకులపై ల్లెలగోలుమూఁకలున్. ౧౫౫

మాలిని. చికిలితఘనకుఁగళ్కు ల్జిల్గుజాళ్వామొఁ లామా
నికరపుఁబనుల నాగిణించు గేదంగిపున్వ
ల్లికలకు మొనయీఁకె ల్లుంపుగాఁ గూడి యచ్చోఁ
బ్రకటత నెలగోలుంబారు వెన్కం జెలంగన్. ౧౫౬

సుగంధి. పచ్చతాతిడాలు చెక్కపక్కెరల్ చెలంగఁగాఁ
బెచ్చుపంచదార మెక్క బీసుమీఁలు రంతులన్
గుచ్చి పాంథవైరకోటి గుండె లల్ల ద్రెవ్వఁగాఁ
బచ్చి దేలు మారుతేజిపౌఁజు లొప్పె నాదటన్. ౧౫౭

ఉ. తుమ్మెదసర్వెణ ల్మోరయ దూఁకొని పుష్పరసోరుదానముల్
గ్రమ్మ భరమ్ముగాఁ గురియఁగాఁ జిగురుంజిగి మేలుధాతుచి
త్రమ్ముగ నొప్పఁ బువ్వగమి దట్టపుడాలు మెఱుంగుఁగత్తుల
ప్రమ్మగఁ గుంజకుంజరపుఁబంక్తులు రంజిలె *నక్కజంబులన్. ౧౫౮

మత్తకోకిల. వల్లిరశ్మిపినద్ధచక్రనిబద్ధకోకిలఘంటికా
వేల్లదారవకీరఘోటకవిస్ఫుటోదయ కేవలో
త్ఫుల్లసూనశరాసబాణమనోజ్ఞతూణసమగ్రతా
సల్లలత్తరుచిత్రభూరథసంఘ మాదట నొప్పగున్. ౧౫౯

శా. నానాసేనల నీగతి న్భువనసమ్మాన్యాత్మవై త్రైకయా
త్రానూనంబుగఁ జైత్రమంత్రివరుఁ డాయత్తంబు గావింపఁ దే
జోనవ్యుం డసమాయుధుండు నిజవిస్ఫూర్తి న్విడంబించిన
జ్జైనం జూచ యిఁకేట్లొకో తెఱఁగువం చాత్మ న్విచారింపుచున్. ౧౬౦

మత్తకోకిల. ఇంకనొక్కయుపాయముం గల దీతఁడుం దనప్రాణముల్
గొంక నొక్కతఱిన్ హరింపుఁడుఁ గూరి కాఱియ వెట్టకే

*సక్కదంబులన్ - పూ.

ఉ. సుందరయాన యిందుమణిసుందరమందిరసీమ లేమికిం
దందరఁ జెంది సుందరులు తద్విధ మెంతయు నీలవేణికిం
బొందుగఁ జెప్పినం జెలులఁ బుల్కనఁ జూచుచు నుల్కి నెమ్మదిం
గొందల మంది హా యెటకుఁ గోకకుచామణి యేగెఁ జెల్లఁబో. ౧౭౨

క. అని చెలుల దూఱుచును మది, వనటం గూనుచు లతాంగి వడి నచటచటం
గనుఁగొని చొప్పరయుచుఁ జెలి, ఘనతరశృంగారవనముఁ గని చొచ్చె నెసన్.

చ. అడుగులజాడఁ జూడ మలయానిలపోతవిధూత మైనపు
ప్పొడి వయి సంతతం బొదవు పూవిరితేనియవానఁ గానఁగా
నపుడమిఁ బువ్వుంబొద ల్చిగురుమావులుతావుల జోకమోక చొ
ప్పడు నిరవు ల్కలంకుగమిపజ్జలు నన్నియుఁ జూచి యంతటన్. ౧౭౪

ఉ. ముమ్మర మైన మైసెక లపూర్వవుటూర్పు కడింది వెట్టయుం
గ్రిమ్మఁగ మిక్కిలిం గమలి కన్పడు నిర్గడ తీనెజొంపముల్
*గుమ్మడి జాజుపువ్వులును గుబ్బచనుంగవ పీడుగన్నముల్
కొమ్మపదారవిందములు గూడఁగ నోఁచినతీరినఁ దెల్పఁగన్. ౧౭౫

క. అత్తెఱువున జన నొక్కెడఁ, జిత్తభవుపియంపసెజ్జఁ జేరి బలువగల్
కుత్తుకబంటిగ నొంటిగఁ, జిత్తము తత్తఱముఁ జెందఁ జీఁ తెలుదాకిన్. ౧౭౬

చ. పగలొనరించుతేని సెకి పర్మిమ్మన లేదొగఱేని రేకతోఁ
దగవున కేగుదాని సెకదాలుపు వేలుపు జోఁక జోకనో
నొగిలినపూలదండ వగ నూల్కనుదాని నసంస్కృతాంగి య్యై
జిగి X విడనాడు కాకవితదిన్నతనంబు వహించు నెచ్చెలిన్. ౧౭౭

సీ. వీమలు ముయు వచ్చి † వె (సనంగు) ళులువీడుఁ గలకంఠకలకంఠ గానతతికి
మునుఁగు వెట్టఁగఁబూని వెసఁద్రోచు బటీయుంటమాధుర్యమాధుర్యమధువిస్ఫృతికి
సీత్కరించియు వెండి ‡సీత్కరింపమిఁ జెందుఁ బల్లవపలవభల్లహతికి
వడఁకియుమగుడ గొఅడుపాఱు మలయాగమలయాగమసవిహారచలకృతికి
నిల్లుదోలుదొల్తభయపడియెఱిఁగియుంతఁ, దనువుదొఱఁగంగఁదలఁచినదాసికకట
మూరుచెయ్యల కేలొకోమూఱికొనఁగ, ననుచు వెచ్చగనూర్చుచు నడలుదాని

చ. కనుఁగవ విచ్చి చూచు మదిఁ గప్పుఁ గృష్ణుఁ డటంచుఁ జెంగటం
దనగుతమాలసాలరుచిధట్టము దార్కను రిత్త కౌఁగిలిం

*గ్రిమ్మడి-మూ- గురుముడి- లక్ష్మీపతిగారి భారతవ్యాఖ్య- కొమ్ముపియనివ్యవహారము
† వదనాకు †వె...ల్గగులు- ‡సీత్కరింపఁగ.

దీసఁ దనచేతిలోఁబడమిఁ దన్నుఁ గనుంగొని కన్నుల నీరు *నించి వం
(ది) వనలపాన్పుఁ జేరి విధిఁ దిట్టుచు వెచ్చగనూర్చెనచ్చెలిన్. ౧౮౦
క. ఉసుగసికన్నీరవ్వా నదం, బడి జాతినుశయ్యఁ జూచి పాపప్రదేశం
బొడలిచట విడువ X నీయఁడు, చెడఁజూచెదఁ గటకటాయిసీయనుదానిన్
ఉ. అత్తమొలం దెలంగెడుమహానసనంబు కరంబు చేగచే
హత్తి హరింప మున్ను మన సందనవాఁడవు మమ్ముఁబోటులన్
రిత్తమొల స్మలంగ విహరించుట నీమది కెగ్గ దోఁచునే
దత్తగ కాఁడ యంచనఁగఁ దత్క్రియ నీవొనరించు చున్నఁడో. ౧౮౧
ఉ. పల్లవవృత్తి నీ వధరపల్లవఘాతకు మొగ్గ కేటికో
పల్లవమున్ హసించు జిగిపట్టని యంచునో తత్సమాసము
నుల్లభ సంచరీఘటన వర్తిలఁజేసితో యంచు నే నన
న్నల్లనఁ బంట మోవి గొని మేలగు కెంపులు నించుచున్నఁడో. ౧౮౨
చ. కలికిమిటారిగుబ్బచనుగట్టుల వేగుస కోర్వఁజాల వి
చ్చలు క్షణమాత్రి నాయెడఁ బొసంగఁగ నిల్పుదునో సుధారసం
బు లొలుకనీక మోవి పలుమారుపున నానుదునో యిఁకేమి కా
వలె నది సూస్తసంచుఁ దమివాఁడఁగ నిట్లలరించుచున్నఁడో. ౧౮౩
చ. తలఁపున నిల్పుచు స్మృతిఁ దాలిమి నిల్పఁగలేక కౌఁగిట
న్నిలుపున గుబ్బి మోముపయి నెమ్మొగ మూఁది యు మోవి తేనియ
ల్పలుమొన లాని చెక్కు-గనఁ బల్మొలు గీటుచు నంతఁ గేళిమై
యలరులపాన్పుపైఁ †బెనఁగియాడుట యెన్నఁడొకో మనోహరా. ౧౮౪
చ. మగని ‡మెఱుంగుఁజేల మిటుమార్పడఁ గట్టితి వాతఁడు క్రయ
మ్ముగ భవదీయవస్త్రమును బూని నెఱుంగరిదేమి వింత యిం
త గలవటే సరాటములు నాతిరో సన్నకుసన్న హాయి పూ
ర్వగతి బొసంగరాదె యని రామ లనంగ మెలంగుచున్నఁడో. ౧౮౫
చ. అని పలవించుదానిఁ దను వారయ నెంతకడిందిరోజ ధ
ట్టినను విడ నార యం చిటునటుం బొరలాడెడుదాని నింక న
స్వనిసఖురాత్ము దూఱికొనఁగాఁ బనియేమి దయం దొలంగెఁగా
నెనరుడి నీలవేణి యని నెవ్వగ వెల్లి మునుంగుపైదలిన్. ౧౮౬

---

*నించమె.....పసల. + నివ్వాడు ‡పెనుకువారుబ- మూ. పెనఁకువాడుఅనియు నన
వగ్గు. † పలంగుచేల.

గీ. సకలభూషణలక్షణసంగమంబు, వీడనాడుచుఁ జూడ్కికి వింత యగుచు
లలితవైఖరి గనియునబ్రింబుగాఁగ, సదృశవస్తునిబంధన సడలుదాని. ౧౮౭

చ. అనయము మాఱుఁ జేయుపువ్వుటమ్ముల నెమ్ములు గాఁడి వాడి నె
మ్మనమున వంతఁ జింతిలుచు మక్కువఁ జెక్కిటఁ జేయుఁ జేర్చి నె
క్కొను (పెను) వేదురంపు ననుఁగున్నవలారతినంబుఁ జూచి గ్రి
క్కున భయవిహ్వలాత్మ యయి క్రొమ్మెఱుఁగారు మిటారి కత్తెలన్. ౧౮౮

ఉ. సందడి చెందకుండ నొకచాటున నుంచియు నీలవేణి తా
ముందుగఁ బోయి కౌఁగిటను ముద్దియఁ *జేర్చి ముఖాంబుజంబుపైఁ
జిందునునుంగురు ల్లతగఁ జేరిచి చెక్కుట నిచ్చలంబుగాఁ
బొందిన మేలు కేల్దిగిచి పొంపుగ బిందులు సింద నిట్లనున్. ౧౮౯

ఉ. అమ్మకచెల్లి చెల్వ తృణమైన వయస్యలఁ బాయ వెన్నఁడే
నమ్మఁజి వారికన్నఁ దమి నాపయి నెక్కుడు గల్గుదాన వీ
విమ్మెయి నొంటి రాఁ దగునె యాకడుగోలపు నీకడిందిపై
ధమ్ములఁ కేమనందగుఁ బదమ్ములు పుష్పాడి కెట్లు లోర్చునే. ౧౯౦

ఉ. పల్లవసంగతి న్నెలఁగుపాచము లుండెడుచోఁటు మాటికే
యుల్లస మైన బేరజము లీఁగెడుమాఁట విపాళిపాటు లెం
పిల్లెడితావు చూడఁగనె బెట్టు హరించెడిముద్దుపెచ్చు పెం
పిల్లెడునిక్క యక్క యిది భీతిల కిచ్చటి కేలవచ్చితే. ౧౯౧

క. నగవారి నెఱుఁగనైతివి, తగ వారడిపాలు సేయఁ దలఁచితి వయ్యో
మగువా యింతటి కట్టిడి, తెగువాను మటంచు నెవరు తెలిపిరి తల్లీ! ౧౯౨

క. శయ మానుచుఁ జెక్కిట సం, శయ మానఁ బనేమి కుసుమశరు నలనయో
భయమా నవలా నీకు న, భయ మానలినాక్షుఁ డిచ్చుఁ బరమార్థముగన్.

చ. సకియ మరుండు నీదుకనుసన్నల వాఁ డట యెక్కడకేగెనె
పికము శుకమ్ము నీపలుకు బేరిమి దాఁటఁగలేదు నీదు న
ర్తి కరుగుణంబు నంచగమి; తీవి వసంతతుఁ దలంతి నీపనీ
పుకుఁ దలఁ సడ్డచేయుచు భవాదృశ కీర్తులు రాఁగ నర్హమే. ౧౯౪

క. మొదట ననంగుఁడు మదనుం, డదనున విరియంగఁ బాఱునట్టివి శరముల్
పదిలనవి మృదులవిషమత, మదనువలన భీతి నీకు మది వలదమ్మా. ౧౯౫

* చెర్చి.

ఉ. నీరసరాగదోషముల నీటు దొలంగఁగఁ జాఁ బయోరుహా
బీరుచిరంపు గన్నులకు నీ దనఁగూడక యుండుఁ దొల్తుద
న్నీరజపత్రికిం దపము నేఁడు ఫలించెఁ గదే కటాకటా
నీరసరాగము ల్గలిగి నీ టను నీకనుదోయి సాటిగన్ ౧౯౭

చ. చెలువపుఁ బూవుఁ జేసె బలుచిత్తజు నైనను మాన కెప్పుడు
న్కలయుచు నుండుఁ బుష్పసిదుమారము నేగతి నోర్చితమ్మ సం
కులమదబంభరప్రకరకుట్టన నైనఁ దొలంగ కెంతయుం
గలయఁగఁ బన్నె తేనెజడి* కారియు మారియు దాని నైఁచితే. ౧౯౮

సీ. జలమున జీవించు జలజనాళంబులు దినమందగతులు సంధిల్లుచోటు
నతిరక్తముఖత సంతతసత్ఫలచ్ఛద నడరుకల్లరులు సజ్జాదునిక్క
కను గెంపుగదురఁ జొక్కపుఁ దేజిగుర్వాడిచి మనుపిసాళులు చెలఁగుబాయ
మలినచ్ఛదముఁ బూని మధుమాత్రి వాసన సౌఖ్యమత్తాళి పెంపెక్కు వంక
యిటను మెలఁగంగఁ గటక టేమిటికి వచ్చి
ఓ ఘనమృణాలభుజకాండ యోసుబింబ
దశనవసన యోకిసలయతరుణచరణ
యోసుగభికాంగి నెమ్మది నోటలేక.

చ. మెలఁతరో కృష్ణుపై మనసు మెత్తని డెంతకడింది యయ్యె నే
కలితమృదుత్వసంపదల గాదిలి చందురమోము యాదిగాఁ
గలసుకుమారవస్తువులఁ గా దను నిచ్చెలువంపుమేను నేఁ
జెల యిటువంటి బల్కటికిచేష్టలఁ బెట్టఁగఁ బట్టె నక్కటా. ౧౯౯

క. గురుశిక్షచే మహాగము. గురుమర్మము గనియె మున్ను గురుకుచ యిప్పుడుం
బరికింపఁ గనియె మన్మథ, గురుశిక్ష మహాగమంపుగురుమర్మంబుల్ ౨౦౦

గీ. అతిఘనాగమసంబంధ మతివ కమరె
నతిఘనాగమసంబంధ మబలఁ గన్న
యినుఁడు చెందఁడో చాయయు నెనయలేదో.
కారణగుణంబు కార్యంబు గనఁగరాదొ. ౨౦౧

గీ. కృష్ణునందు సరాగత గీలుకొన్న
యింతి కపరాగసాంగత్య మెట్లు పొసఁగు

---

* కాయర.

నెన్నఁగఁ బరాగ మొప్పును సహించునింతి
కిపుడు దాని సహించుట యెంతయరుదు. ౨౦౨

గీ. విదుషి వభ్యర్హితపదార్థవేత్రి వీవు, తండ్రిఁబోలుచు మమ్ము సంతాపపడఁగఁ
జేయు నేటికిఁ దల్లియా ఛాయ బోలి, చల్లఁజేయవె మమ్ములఁ జంచలాక్షి.

వ ఇట్లు పల్కుచు నాలోన. ౨౦౩

ఉ. అక్కట యెందునైన హరిణాక్షులు చక్కనివారిఁ గోరరో
మక్కువ వెతెంగి తండ్రి గరిమం బ్రియుఁ గూర్పఁగ వే రమింపరో
చక్కఁగఁ గూడి యిట్టిపలుజాడలబూమెలు చూచినారవా
యక్కరో నీకు" గల్గె నని యాడెదు చేడెలఁ జూచి వారలన్. ౨౦౪

చ కనలుచుఁ బల్కు పల్కు కసుగందని ముద్దులగుమ్మ యన్మనీ
మనమునఁ గోరుకొన్న యలమాధవు నీధవుఁగా నుటించు నీ
జనకుఁడు *నేఁడొ తేపొ యతిసౌఖ్యము నొందెదు తెల్లవాఱినం
గనుఁగొనువారు మెత్తురు వగల్గొని తెంపున కట్లు చొత్తురే. ౨౦౫

చ. పొలఁతిరో యోఁడుచందమునఁ బుట్టినవారికి నెల్లఁ గోరికల్
గలయవెనీకె యన్నటులు గా దిఁక నే మని యంటివేని పైఁ
దొలఁకఁగనీక కూర్మి మదిఁ దొట్టిన గుట్టుగ మట్లు సేయుచు
న్నొలఁగుపొలంతి యెన్నఁదగు మేటి నెలంతలలోనఁ బైదలీ ౨౦౬

క. కన్నుల నీ రేటికిఁ దెలి, గన్నులచెలి కొన్నినాళ్లు గడవం దగవే
కన్నుల మూఁతం జేకొని, కన్నులవిల్కానిబారి గడచెదు సిరసన్. ౨౦౭

మ అని సి గ్గెక్కఁగఁ బల్కనం దరుణి యయ్యబ్జాక్షి కంఠంబున
న్ననుఁగేల్దమ్ములు గట్టిగాఁ బెనఁచి కన్నంగోనఁ గొ్రవ్వేఁడినీ
ర్గొఁపఁక న్వాడినమోము దమ్మి చెలిమద్దుం జన్నఁబూబంతులం
దను వొత్తిల్లఁగఁ జక్కఁ జేర్చి ‡రహించిందం బల్కు మందంబుగన్. ౨౦౮

†ఉ. కాఁకలుముంచు నేనుగలకట్టిడితండ్రికిఁ బుట్టునాకు మై
కాఁకలుగాక (సౌఖ్యములు గల్గు) నె యక్కట తప్పనంటిఁగా
కాఁకల కోసమై కొఱఁతగాంచిన నోములు నోఁచునాకు బ
ల్కాఁకలు గాక యోజమున కాంచెనె కాఁకలుతత్తనూజమై. ౨౦౯

ఉ సానలుపట్ట నోర్చు నినుచక్కని కూఁతురఁ (గాళియోరగా)
మానవిషానలఁచ్ఛటల కోడని §యేటికి మద్దుఁజెల్లెలన్ -

*వెరెరేపె ‡రక; మూ †చూ ౨౩వ పద్యముపోలిక. §యట్టికి-మూ.

హాసకి మూలమై జగతి నాడిక కోర్చినతేసితోడఁ గా
నేని భరింప నావశమె యిట్టి యయోగదవాగ్నికీలలన్. ౨౧౧

చ. నను గనినట్టివారలకు నావయిఁ గూర్మి యొకింతలేక య
న్యసటఁ దోలంగఁ జేయుట యవాస్తవమై యిటు లుండుకోఁగ ని
ప్పుడి మది మీకుఁ బట్టదని పొల్పడి చెప్పఁగనేల యిద్ది మీ
కనభిమతంబ యేని రుచి*యబ్బని గ్రక్కన నీదృశోక్తులన్. ౨౧౨

క. అటువంటితల్లిదండ్రుల, నిటువంటి యనుంగుఁజెలుల నే నందుటఁగా
యిటు లాప వెడసి కోరిక, చిటుకురు మనకుండ నమరి చెలు వందిలేఁగా.

ఉ. నీలరుచుల్ ద్గోలంకు సురనిమ్నగచెంగట దర్శచంద్రికన్
మేలగుదచ్చినాదముల మెచ్చుగ నప్రిజకన్నమూకు లే
వేళ నుతుల్ ఘటింతు రతివేలమదీయమనోవ్యథాభిదా
లాలసతం జనించి యతిలాలితిఁ జెందెదు మీదుకీర్తులన్. ౨౧౩

సీ, కన్నవారికిఁ జెప్పి కరుణ పుట్టఁగఁజేసి తలఁపు చేకూర్పరే తల్లులార
మీరైన వారికి నామనితాపముఁ దెల్పి యతని నిం డంపరే యమ్మలార
ముస్నిట్టికార్యంబుఁ జెన్నుగా ఘటియించు చెలువల వినరటే కొలఁతలార
భాగ్యవంతుల కెలఁ బ్రాణదానము మించు పుణ్యంబుగలదటే పొలఁతులార
నే విశేషించి మీదాన నెలఁతలార, మనసు మీదెంత కటికియే మగువలార
యానునయంబునఁ దీసునే వనితలార, తాళఁజాలను మీయాన తరుణులార!

సీ. వెత కింతకైనఁ దాళితి నయో నేఁజెల్ల నేనెంత కటికినే నీలవేణి
యోఁదుఁబుట్టుకఁ జెందినట్టి యింతులకెల్ల నీలాగు లేదటే నీలవేణి
యెటువంటిపని యైన నీడేర్పఁగల నని నెమ్మి నమ్మితి నిన్ను నీలవేణి
కూర్మిచే నుండెదు కొమ్మలలోఁజాల నెనరుదానవుగదే నీలవేణి
నీదు నెన రెందుఁ బోయెనే నీలవేణి, నేర్పుచేఁ గార్య మీడేర్పు నీలవేణి
యేల యీవట్టిమాటలు నీలవేణి, తాళ హరియాన యిఁక నేను నీలవేణి

ఉ. చక్కెరవిల్తుఁ జేయుసుమసాయకపంక్తిఁ దిరాభిమానముల్
గ్రక్కునఁబోకమున్న చెలికత్తియ యొత్తము సేయునారడిం
జిక్కఁగ †బల్కు లంగడికిఁ జేరకమున్న ప్రియంబుగాఁబ్రియు
న్నక్కున గారవింపఁ గలయంతకు నోఁచితివంటె నెచ్చెలీ. ౨౧౪

* యబ్బదె†బల్పులంనడికి

సీ. మాధవాధరసుధామాధుర్యమునఁ దేలు వంశంబుజన్మంబు వడయ నైతి
హరిభుజాంతరవాససిరతి నింపార హారమణిస్వరూప మై యమర నైతి
యాదవమహాళిమోహాసితాపాంగకలాపంబు నై యేని యొప్ప నైతిఁ
గమలామనోనాయకమనఃప్రియోద్దామమాధవి నై యెట్లు మలయ నైతి
నకట వీనిలో నేదైన నొకటి యైనఁ, బొంగు నుబ్రియాంగసంగమాభంగసుఖము
తపనసుత నైతిఁ దాపంబుఁ దఱఁగ నైతిఁ, జెలులు మీ చేతిరట్టు చేసలయ నైతి.
క. వలపు పగవాఁ గ్రైన, న్వల దది యెటులన్న నట్టి వలపున నేనం
దొలఁచెదుఁ బ్రాణము లిగడె, నిఖుప్రటయోగండమయ్యె సిక్కము చెలువా.
గీ. ఒరులవెత యొరు లెఱుఁగ రౌ నుర్వి ననుట
నిజ మనుఁగుఁజెల్వ లే రవ్వ నెఱపఁజొచ్చి
రకట మదితాప మిటు మీకు నరసి తెలియఁ
బడదు మోచు (వాఁడెఱుఁ)గుఁ గానటిభరమ్ము. -౨౧౯
చ. పతులను గోరు నెల్లరకుఁ *బాటులివే యయినట్టు లైన నీ
సొగసులు చెలంగి నన్ను నెకసక్కెము లాడుదు రే యిదంత నా
కత యగుఁబోలు నెట్టయినఁ గానిము ప్రాణము లిప్పు మేచ ను
న్నతజేఁ గదా యిఁ కెన్వరు ననంగల యాడిక లజ్జగోచవా. -౨౨౦
గీ ఔర యప్రస్తుతప్రశంసాస్వతంబు, పల్కనను వ్యాజనిందానిబద్ధసూక్తి
లలితసంగశభావ నేర్పొలయ నన్ను, మీరు నవ్వుట యెఱుఁగ నెమెలఁగేలార
గీ. వనిత యర్థాంతరన్యాస మొనరు నెట్లు, మదికి సరపేక్షవస్తుసమర్థనమున
మదికి నిం పగుఁ గాదె సామాన్యఘటిత, భన్యవస్తువి శేషసంబంధ మునర.
సీ. కలదన్నఁ గలవానిఁ గలిమి చేడియ తేనిఁ గరమున నుడివాలు గలుగువానిఁ
గడలినుండెడువానిఁ గరిఁగాచునగవానిఁ గరుణసిల్కెడుచూపుగాంచువానిఁ
గలికినవ్వులవానిఁ గౌస్తుభద్యుతివానిఁ గనఁగ నళిక్యమహా కతలవానిఁ
గనకంపురుచులీనఁ గలవచ్చడమువానిఁ గలుగుకాలంబెల్లఁ గలుగువానిఁ
గన్నువేత్రీలవయసులు గొన్నవానిఁ, గన్నయింతయు నవలీలఁ గన్నవానిఁ
గన్నులను †మంచుసెకమించుగన్నవాని, గాంతుగా నోఁచునక్కాంత కాంత కాంత.
చ. అలదమయంతిఁ (బోలె) నను నంచితపుణ్యా నొపర్పు మన్నలుం
దలఁపుము మాధవాప్రకృతతాశధనస్ఫుటభాగ్యగా నయో

*పాటియిదే † మించు

పన్నుచు వచ్చు నాదుప్రతిబంధము వీడియు నంతలోనె నే
నున్ననుచుం జలించును గనుంగవ విప్పఁగ మాయ (హా) సఖీ. ౨౩౧

మత్తకోకిల. నీవు నాయెడఁ గూర్మి బోటివి నెమ్మి నాపయిఁ గల్గినం
బూవుఁబోఁడిరో నాదుకోరికఁ బొల్చు నొక్క రహస్యమే
చూనె నీమది నెంతలే దని చూడ కప్పని వేగనే
చేవ దప్పక తీర్చ దేశయుఁ జెప్పద న్వినుతప్రియున్. ౨౩౨

వ. అది యే మని యంటివేని. ౨౩౩

శా. సాక్షాన్మాధవగాత్ర సంగతికి నోఁచం గావుసన్ దీని క
క్షాక్షుం గస్తురివన్నె జృంభితసువర్ణాంభోజపత్రంబుపై
నక్షీణస్థితి వ్రాసి నన్నును దదీయాంచన్మహోదారస
ద్వక్షోమధ్యమపీఠి గూఢిగ లిఖింపం జూచి యైనం జెలీ ౨౩౪

క. బిత్తరి చిత్తములోపలి, యుత్తాప మొకకొంతయైన నుడిపెన నిటుగాఁ
జిత్తము నిలుపంగదవే, యుత్తమసుకృతంబు నీకు నొసఁగు నటంచున్ ౨౩౫

చ. పలికి గళ న్మరందరసబంధురగంధరసాంధబంభరా
కలితరవంబులం బ్రసవక్రమవిభ్రమసాంద్రతామ్రకో
మలనవపల్లవగ్రసనమంజులపాయితకంఠ కాకలీ
కలకలకంఠనాదములఁ గల్కి లతాలున నుల్కి యడల్కియున్. ౨౩౬

వ అప్పు డప్పల్లవపాణి కపటగోపికాపల్లవాయల్లక మెల్లం...దురంతసంతా
పంబున నెంతయు నొల్లంబోయిన నీలవేణి శోడి నీలవేణులం గూడి కటక
టంబడి చింతించి యాయుంతికి సంతాపంబు బలనంతం (బలంతుల) పంతం
బుఁ జెంద నేర దీయెడఁ గొంతకొంత శాంతిబొంద శిశిరోపచారంబులు పచ
రింపం దగు ననినఁ దత్సహితలై తత్సహితలు తత్క్రియాయత్తచిత్తలై
రయ్యవసరంబున. ౨౩౭

—కాళిందికిఁ జెలులు శిశిరోపచారములు చేయుట—

ఉ. తావుల మోక* మావిగమి తావుల గొజ్జఁగనీరుయంత్రముల్
కేవలఁ జిల్కఁగాఁ జిగురు†గేదఁగిపూదడిగట్టి పట్టివేర్
పై వటిలాటుచెంగలువపందిరి చెందొవ రేకవంటి క్రొ
మ్మావులచందువాపొగడమొగ్గల నిగ్గులచప్పరంబులోన్ ౨౩౮

*మామిగమి † గేదడిపూఁదడి

సుగంధి. కప్పురంపుఁదిప్ప నొప్పఁ గమ్మ పైఁజిలికమ్మ మే
ల్పుపొడి (సచించినట్టి పువ్వు సెజ్జమీఁదికిన్
అప్పడంతిఁ దెచ్చి, తెచ్చి రంబుజాక్షు లందఱుం
జెప్పరాని వేగ మూని శీతలించు వస్తువుల్. ౨౩౯

ఉ. సారసచంద్రసైకతసుదసంకుమదాగురు కేసరాళిక
ర్పూరపరాగకుంకుమసముజ్జ్వలసల్లవహల్లకాచ్ఛక
హ్లారతుసారనీరబిసహారసమంజసపుష్పమంజరీ
వారము లాదిగాఁ గొనుచు వచ్చి కరం బరుదారు నేర్పునన్. ౨౪౦

చ. మలయజకర్దమం బొడల మాటి కలంది మృణాలవల్లరీ
వలయచయంబు లంఘ్రులను బాహువులం గదియించి వేనలి
న్వెలయఁగఁ దెల్లదమ్మి యిడి పెల్లుగఁ గస్తురి కంధరంబునం
గలయఁగఁ బూసి యింతి శివుకైవడిఁ జేసి రనంగభీతికిన్. ౨౪౧

చ. మృగమదచర్చ యంతటను మేన నలంది పరాగరాగసౌ
భగకదళీదళంబుఁ గట్టి పై నిడి చెందొవపువ్వుటెత్తుఁ బొ
ల్పుగ నెసనుంచినప్పు సఖి వొల్చె ననారతశౌరిభక్తియో
గసుఖజాతరంగ యగుఁగానఁ దదాకృతి దాల్చెనో యనన్. ౨౪౨

ఉ. అంగజుఁ డంగనాఘన హృదంతరకర్పరసీమ స్నేహను
ష్బంగి నభంగురం బగుచు భాసిలఁగా దళపై దశాంతరం
బుం గదియించి క్రోధనఁబరిపూర్ణతఁగాంచి యుయోగదీప మే
చం గదు (సుక్కు)చుం గిసలసంఘటితవ్యజనానిలంబునన్. ౨౪౩

సీ. పదములఁ జగురాకు లొదవించి జంఘల స్మరతూణతిలకము ల్మరువుకొల్పి
తొడల నరంటిద వ్వడరించి సాబగారుకటిపైఁ బరాగసైకతము నించి
నడుమఁ బుష్కరభంగి దొడరించి యాటన జొకగాఁ గస్తూరి రేక దీర్చి
చన్నుల గుచ్ఛము ల్పవరించి నెమ్మోనఁ జందనం బలఁది భుజంబుల బిస
కాండమిడిచెక్కులనుజంద ఖండమలఁది, వేణిశైవాలమునఁగూర్చి వెలఁదియంగ
సామ్యసదసత్పరీక్షావిచారణ బలెఁ, జెల్వ లీరీతిఁ జేసిరి శిశిరవిధులు.

చ. ఎడపక యింతులెల్లఁ గదియించినపల్లవసూనగుచ్ఛముల్
తొడరి వియోగవహ్నిసెక దొట్టఁగ *జివ్వన నీరుదీసి మె

---

* [illegible]

